# కరుణా తరంగిణి



శ్రీ పెన్మెత్స రాజంరాజు

కోణార్క్ పబ్లికేషన్స్
పబ్లిషర్స్ అండ్ బుక్ సెల్లర్స్
మ్యూజియంరోడ్ * విజయవాడ-2

ప్రథమ ముద్రణ :
1994 వైశాఖ పూర్ణిమ



వెల : రు. 10/-



ప్రతులకు :

శ్రీ వాసుదేవాశ్రమం
చోడవరం 534111
(వయా) అనంతపల్లి
ప. గో. జిల్లా. (ఆం.ప్ర.)

రచనా కాలము 1962 సం.

ముద్రణ :

**అనీలా ప్రింటర్స్**
దాసువారి వీధి, విజయవాడ-2.

# ప్రమోదము

రామాయణేతివృత్తాన్ని ఆలంబన చేసుకొని "ఏకోరసః కరుణయేవ" అని నిరూపించాడు మహాకవి భవభూతి.

బుద్ధుని జీవితాన్ని అధారం చేసుకొని ఆ సిద్ధాంతాన్ని బలపరిచారు పెక్కురు ప్రసిద్ధ కవులు. వారిలో 'మధురకవి' శ్రీ వెన్నేటి రాజంరాజు ఒకరు.

శ్రీ రాజు 'బుద్ధ పురాణము' ఇంత వరకు తెలుగులో వెలువడిన గ్రంథాలలో ప్రామాణికము, సమగ్రము నని పండిత ప్రకాండులు పేర్కొన్నారు.

ప్రవహించే నదిలో కన్న నిశ్చలమైన సరస్సులో ఈదడం కష్టం. ఛందోబద్ధమైన పద్యరచన కన్న గద్య రచన క్లిష్టం. అందుకే 'గద్యం కవీనామ్ నికషం వదంతి' అన్నారు పెద్దలు.

శ్రీ రాజు పద్యకవులుగా ఇంతకు ముందే ప్రసిద్ధులు. ఈ 'కరుణా తరంగిణి' వచన-కావ్య రచనతో సుప్రసిద్ధులే కాదు; రససిద్ధులని కూడా అనిపించుకొంటారు.

ఆయన శైలి సరళ సుందరము, రసబంధురము.

వారి అమృత హస్తాల నుండి మరిన్ని రసవత్తర కావ్యాలు వెలువడ గలవని ఆశిద్దాం.

ఏలూరు
24-5-94

అల్లూరి వేంకట నరసింహరాజు
M. A; M. Ed. Ph. D.

# శ్రీ రాజంరాజు రచనలు

## ముద్రితములు

| | | | |
|---|---|---|---|
| 1. | చిత్రవాణి 1వ భాగము | ఖండకావ్యము | 1950 |
| 2. | చిత్రవాణి 2వ భాగము | ఖండకావ్యము | 1951 |
| 3. | రామ భూపాల శతకము | | 1951 |
| 4. | సంయుక్త | | 1956 |
| 5. | బుద్ధ పురాణము | | 1983 |
| 6. | ప్రణయ తపస్విని | | 1986 |
| 7. | అమర కథ | | 1987 |
| 8. | కరుణా తరంగిణి ప్రతులు 2000 | | 1994 |

## అముద్రితములు

మోక్ష సన్న్యాస యోగము

సలీమా

ఉద్విగ్న హృదయాలు

---

With Best Compliments From :-

# ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయకులు

| | | |
|---|---|---|
| శ్రీ కొట్టగడ కొండారావు | బండపుతము | 500-00 |
| శ్రీ యలమర్తి కొండ్రాజుగారి భార్య సత్యవతి జ్ఞాపకార్థము వారి పుత్రులు | | |
| శ్రీ పురుషోత్తం, సూర్యచంద్రం | పోతిసీడుపాలెం | 500-00 |
| శ్రీ విల్లూరి రామన్న మెమోరియల్ హాస్పిటల్ డా॥ పి. విశ్వజ్యోతి | నిడదవోలు | 500-00 |
| శ్రీ స్వర్ణదుర్గ మహిళా మండలి | చిన్నాయిగూడెం | 500-00 |
| శ్రీ గీతాసమాజం, కొత్తపేట | చిన్నాయిగూడెం | 500-00 |

ప్రాథమిక ఆరోగ్య కేంద్రముల సిబ్బంది

| | | |
|---|---|---|
| 1. దేవరపల్లి, 2. యాదవోలు, 3. గోపాలపురం, 4. కొయ్యలగూడెం, C.H.O., చాగల్లు | | 500-00 |
| శ్రీ గన్నమని వెంకట్రావు, సోమరాజు సోదరులు | చిన్నాయిగూడెం | 300-00 |
| శ్రీ కూచిపూడి వెంకటేశ్వరరావు | చిన్నాయిగూడెం | 300-00 |
| శ్రీ/శ్రీమతి పరిమి గంగాధరతిలక్, పద్మలు | చిన్నాయిగూడెం | 200-00 |
| డాక్టర్. పాలి రాజానందరావు (మెడికల్ ఆఫీసర్) | గోపాలపురం | 200-00 |

| | | |
|---|---|---|
| డా॥ ఆర్. దామోదరరెడ్డి(మెడికల్ ఆఫీసర్) దేవరపల్లి | | 200-00 |
| శ్రీ/శ్రీమతి పిన్నమనేని ప్రతాప్, సుమతి | ఢిల్లీ | 200-00 |
| శ్రీ/శ్రీమతి విల్లూరి పెదరామచంద్రం, సత్యవతి | చిన్నాయిగూడెం | 116-00 |
| శ్రీ కోలా వెంకటసత్యనారాయణ, బి.కాం. | యాదవోలు | 116-00 |
| శ్రీ కోలా వెంకటరాజు | యాదవోలు | 100-00 |
| శ్రీ పెదపూడి విజయకుమార్ (పోస్టుమాష్టారు) | యాదవోలు | 100-00 |
| శ్రీ పసుపులేటి నాగేశ్వరరావు | యాదవోలు | 100-00 |
| శ్రీ అనిశెట్టి నాగేశ్వరరావు | యాదవోలు | 100-00 |
| ది రఘునాయక కో ఆపరేటివ్ బ్యాంక్ (చిరుదోర్యగి) | చిన్నాయిగూడెం | 100-00 |
| శ్రీ పెనుగొండ వెంకటేశ్వరరావు (మెడికల్ స్టోర్స్) | చిక్కాల | 100-00 |
| శ్రీ ఎల్లిన రామచంద్రరావు | తిరుగుడుమెట్ట | 100-00 |
| శ్రీ రెబ్బాప్రెగడ రామచంద్రరావు | తిరుగుడుమెట్ట | 100-00 |
| శ్రీ అన్నమరెడ్డి గంగన్న | తిరుగుడుమెట్ట | 100-00 |
| శ్రీ అన్నమరెడ్డి ఈశ్వరరావు | తిరుగుడుమెట్ట | 100-00 |
| శ్రీ యిమ్మణ్ణి శేషగిరిరావు | చిన్నాయిగూడెం | 100-00 |
| శ్రీ యిమ్మణ్ణి వీరాస్వామి | చిన్నాయిగూడెం | 100-00 |
| శ్రీ తైలం సత్యనారాయణ | చిన్నాయిగూడెం | 100-00 |

# ప్రోత్సాహకులు

1. శ్రీ పెన్మెత్స వాపిరాజు — శ్రీరామకృష్ణసమితి, విజయవాడ
2. శ్రీ పన్నాల శ్యామసుందరమూర్తి — " " పూర్తేరు
3. శ్రీ ద్వారకా కృష్ణమూర్తి — వ్యాసాశ్రమం, ఏర్పేడు
4. శ్రీ కుదప సత్యనారాయణ (రిటైర్డ్ హెడ్‌మాస్టరు) — ఉండ్రాజవరం
5. డా॥ చిన్నం ప్రదీప్ — కొయ్యలగూడెం
6. డా॥ చైతన్య శేఖర్ (M.O.) — కోరుకొండ (P.H.C)
7. శ్రీ జార్జ్ విక్టర్ — ప్రొఫెసర్ ఫిలాసఫీ (A.U.) వాల్తేరు
8. శ్రీమతి/శ్రీ డా॥ గన్ని భాస్కర్ — స్వతంత్ర హాస్పిటల్, రాజమండ్రి

బుద్ధదేవుని పాద పద్మములకు

# అంకితము

నీ కనుదోయిలో పొడము
    నిస్తుల సత్కరుణా ప్రసాదమై
ఈ కరుణా తరంగిణి మ
    దీయ మనోబ్జమునన్ జనించె న
స్తోకదయా నిధీ ముదము
    తో నిను గొల్చు కృషీ వలుండ నౌ
నాకృతి నీవె గైకొని ము
    దంబున సాకగదే దయానిధీ!

నీవు నడచిన దారిలో నిలచియున్న
గరిక పోచకు నిర్వాణ గతి లభించు
ననిన మర్త్యులు తరియించు టబ్బురంబె
భువన పావన భావయో బుద్ధదేవ॥

# కరుణాతరంగిణి

కరుణామయుడగు బుద్ధుని చరణరజము సోకి శిలలు ద్రవించినవి. మోడులు మొగ్గ తొడిగినవి. పులులు మేకల వలె తొలగి నిలచినవి. క్రూరులు సాధువులైరి. లోభులు త్యాగమూర్తులైరి. తస్కరులు ధర్మచింతనాపరులైరి. జారులు సర్వసంగ పరిత్యాగులైరి. వేయేల ? నేటికిని ఆ మహి తాత్ముని దివ్య సందేశామృత వాహినిలో మునిగితేలు కాలమే రోమాంచము వహించు చున్నది.

బుద్ధ భగవానుడు మాయాదేవి శుద్ధోదనుల ప్రియ పుత్రుడు. శుద్ధోదనుడు శాక్య సామ్రాజ్యాధినేత. ఆయన సింహహంతనుని జ్యేష్ఠ తనయుడు. శుక్లోదనుడు, ధౌతో దనుడు, అమృతోదనుడు అనువారు శుద్ధోదనుని సహ జన్ములు. వీరుకాక శుద్ధోదనునకు 'అమిత' యను సోదరీ మణియు కలదు.

సుగుణరాశి, సౌందర్య నిలయ యగు అమితను "కోలు"డను రాజర్షి ప్రేమించి పెండ్లియాడెను. కోలుని జ్ఞాతివర్గము వారెల్లరును కోలియ నాయకులని వ్యవహరించ

బడెడువారు. దేవదహము కోలియ నాయకుల రాజధాని నగరము.

సుభూత మహారాజు కోలియ నాయకులలో ప్రసిద్ధుడు. నిరుపమ లావణ్య నిలయమైన మాయాదేవి ప్రజావతులు సుభూతుని ప్రియ పుత్రికలు. శాక్యపరిషత్ పరమేశ్వరుడైన శుద్ధోదనుడు మాయాదేవి ప్రజావతులను కోరి వరించెను.

శుద్ధోదనుడు చిరకాలము సంతతిలేక పరితపించెను. సంతానార్థియై పెక్కు వ్రతములు, దానములు చేసి తీర్థ యాత్రలు సలిపి దేవతలకు మ్రొక్కుకొనెను. కాని యౌవ నాంతము వరకు పుత్ర సంతాన వాంఛా పరిపూర్తి కాలేదు. కౌమారము కూడ గడువ జొచ్చినది. అట్టితరి నొకనాటి అర్థ నిశాంతవేళ గాఢనిద్రలో మునిగియున్న మాయాదేవి తనను కొందరు దేవకాంతలు పుష్పక విమానముపై స్వర్లోకమునకు గొనిపోయి వియన్నదీ జలములలో జలకమాడించి సింగారించి కొలువుతీరియుండగా దేదీప్యమానమైన తేజోకిరణ మొకటి వచ్చి తనలో ప్రవేశించినట్లు కలగాంచి మేలుకొని ప్రాణేశ్వ రున కా వృత్తాంత మెరిగించెను. తేడా మరునాడు దైవజ్ఞుల పిలిపించి నిండుకొలువులో తన రాణి స్వప్నఫలితము తెలుప గోరెను. కార్తాంతికు లా స్వప్నఘడియలు లెక్కించి పరిశీలించి "ప్రభూ ! తమకు అచిరకాలములోనే "సత్పుత్రు డుదయించ గల"దని చెప్పి శ్రవణానందము గావించి విశేష సన్మాన

ములు పొంది ముదమంది చనిరి. శుద్ధోదనుడు పరమానంద భరితుడయ్యెను.

అచిరకాలముననే మాయాదేవి గర్భవతి అయ్యెను. వాడిపోయిన శుద్ధోదనుని ఆశాలత చిగురించి మొగ్గ తొడిగెను. చక్రవర్తిని అమరదైవముగా భావించి సేవించు ప్రజల యానంద వాహిని మేర మీరి పొర దొడగినది.

నవమాసములు నిండిన వెనుక కాంతుని కనువిందు సేయు నిండుచూలాలు మాయాదేవి పుట్టింటి కేగవలెనను ప్రగాఢ వాంఛను వెల్లడించెను. దేవేరి సుందర వదనార విందము నుండి వెలువడిన ఆ మురిపెంపు కోరికను వెంటనే నెరవేర్చుటకై శుద్ధోదనుడు వైభవోపేతముగా ప్రయాణ సన్నాహము లొనరించెను.

కమనీయ హిమాలయ సానువుల యందలి రాజ బాటపై పట్టు పానుపుల పైడిరథము సాగిపోయినది. అనుగు చెల్లి ప్రజాపతి వివరించు ప్రకృతి శోభను తిలకించి పులకించి పోవు మాయాదేవి లుంబినీవనమందు ఒకింతసేపు విడిసి విశ్రమించగోరెను.

సాయం సంధ్యారుణ కిరణ రంజితమై విలసిల్లు లుంబినీ వన శోభను తిలకించి ఆనందించుచున్న మాయా దేవికి ప్రసవవేదన ప్రారంభ మయ్యెను. సందర్భ మెఱిగిన

పక్షి బృందము కై దండలిడి దేవేరిని పటకుటీరమునందు ఉప విష్టురాలిని గావించి సముచితోపచారములు చేయ దొడగిరి.

నిండు వేసవిలో తపించు ప్రాణికోటికి శ్రమ నివారకు డైన పూర్ణచంద్రుడు ప్రాగ్దిశను వెన్నెల వెదజల్లుచుండ నిఖిలమానవ భవరోగ నివారకుడైన బుద్ధభగవానుడు మాయా దేవీ గర్భశుక్తి ముక్తాఫలమై ప్రభవించెను.

సుతోదయ శుభవార్త పుష్పసౌరభమువలె వెన్నెల వాక పగిది వేణునాదమురీతి హుటాహుటిని క్షణకాలములో కపిలవస్తువునందున్న శుద్ధోదన మహారాజునకు తెలియ జేయ బడినది. శుద్ధోదనుడు అమితానందభరితుడై వార్తావహులకు అమూల్యాంబరాభరణము లొసగి తనియ జేసెను. మరు క్షణముననే మంత్రి సామంత హితాది పరివారముతో లుంబినీ వనమునకు తరలిపోయి భగవదవతార మూర్తియైన శిశువును దర్శించి పులకించి ఆనందాశ్రువులు విడిచెను.

చిరకాల తపఃఫలముగా జనించిన నినుగు నొడి నిడు కొని మాయాదేవి బంగారపుటందలముపై నిజనగరికి కొని రాబడినది. పూర్ణోదయవేళ ఉప్పొంగే పాలకడలివలె రాకుమారోదయాలంకరణములతో రాజధానీ నగరము కలకల లాడెను. శుద్ధోదనుడు బుధజన సమ్మతమున కుమారునకు

సిద్ధార్థుడని నామకరణము చేసెను. * సిద్ధార్థుని జీవిత మందలి అనేక సంఘటనల మూలమున పెక్కు సార్థక నామము లేర్పడి విశ్వ విఖ్యాతి గాంచినవి.

ఎన్నో వసంతాల నుండి హిమగిరి కందరమున తప మొనర్చు అసిత మహాముని మాయాదేవీ శుద్ధోదనులకు భవ దుఃఖనివారకుడగు భగవాను డుదయించెనని విని పరుగు పరుగున వచ్చి సిద్ధార్థుని దర్శించి ఈ బాలుడు శోక, మోహ, భయ తాడితమైన మానవజాతిని దుఃఖాంత పథమున నిలిపి తరింప చేయునని వేనోళ్ళ వినుతించి వెడలెను.

లోకోద్ధారకుడైన సిద్ధార్థుని కనిన మాయాదేవి ఆనంద పారవశ్యములో తనయుడుదయించిన యేడవనాడు పరమపదించెను. పుత్రోదయోత్సవములతో పులకించిపోవు చున్న రాణిగరి మాయాదేవీ నిర్యాణ శోక వాహినిలో మునిగిపోయినది.

---

* సర్వజ్ఞుడు, సుగతుడు, బుద్ధుడు, ధర్మరాజు, తథాగతుడు, సమస్త భద్రుడు, భగవానుడు, మారజిత్తు, జినుడు, షడభిజ్ఞుడు, దశ బలుడు, అద్వయవాది, వినాయకుడు, మునీంద్రుడు, శ్రీఘనుడు, శాస్తా, ముని, శాక్యసింహుడు, సర్వార్థసిద్ధి, శౌద్ధోదని, గౌతముడు, అర్కబంధువు, మాయాదేవీసుతుడు, ఇవి సిద్ధార్థుని సార్థక నామములు.

# 2

కాలము మహా మహిమాన్వితమైనది. అది తన మృదు కర స్పర్శచే ఎంతటి హృదయ విదారక సంఘటనల నైనను మరపింపచేసి మానవుని యథాస్థితికి కొని రాగలదు.

పత్ని వియోగ రాసిలో మునిగిన శుద్ధోదనుడు కుమారుని వదనారవిందమున హృదయేశ్వరీ రూపమును తిలకించి చిత్తశాంతి పొందదొడగెను. సోదరి నిర్యాణముతో మనశ్శాంతి కోల్పోయిన ప్రజావతికి సిద్దార్థుని పరిపోషణలో కొంత దుఃఖోపశాంతి లభించ దొడగినది.

మిసిమి మీగడల మేనిసొబగుతో, పసిడినిగ్గుల పాల బుగ్గలతో మూర్తిభవించి ముద్దులొలుకు శరదిందు కాంతివలె దినదిన ప్రవర్ధమానుడైన సిద్ధార్థుడు నట్టింట నడయాడు చుండ క్రొన్నన తొడిగిన గున్నమావివలె రాణ్మహలు నేత్ర పర్వము కాదొడగినది.

కుమారుని కైదేండ్లు నిండగనే విద్యగఱపుటకై శుద్ధోదనుడు విశ్వామిత్రుడను మహాపండితుని నియమించి అక్షరాభ్యాస మొనరించెను. అపూర్వ మేధావియగు సిద్ధార్థ రాకుమారుడు సకల విద్యాపారంగతుడై తన నిరతిశయ

ధారణా పటిమతో గురుదేవుని డెందమునకు కూడ అబ్బుర పాటు కలిగించుచు వేద శాస్త్ర పురాణాదులందేకాక క్షత్రి యోచితములైన అసిచాలనము, అస్త్రప్రయోగము, గదా ప్రహారము గజరథతురగ చోదకత్వములయందు కూడ సమ కాలీనుల కన్న మిన్నయని మన్ననలందెను. చతురంగ బల ముల సమీకరించి వ్యూహ రచన గావించి నిరపాయముగా భేదించగల సమర తంత్ర ప్రవీణుడయ్యెను. కుమారుని సర్వతోముఖ ప్రతిభా విశేషములు కనుగొని శాక్యరాజు లోలోపల ఉప్పొంగి పోయెడివాడు.

సకల కళా విశారదుడైన సిద్ధార్థు డీ బాహ్య విద్యా పరిణతితో సన్నుతానంద భరితుడు కాలేదు. ఎల్లప్పుడు ఏకాంత విహారాకాంక్షితుడై తనలో తాను ప్రకృతి కావ్య పరిశీలనా నిమగ్నుడై యుండెడివాడు. అతని కీ ఖేద మోద మయ జీవితయాత్రతోడి ప్రాణిలోక పరిపాలన అశాంతి నిలయముగా, దుఃఖభాజనముగా బుద్బుద ప్రాయముగా కనవచ్చెడిది. నేడు పొడమిన చిగురుటాకులు మరొకనాడు పండి రాలిపోవుచున్నవి. హిమ బిందువులచే అలంకరించబడి ప్రాతస్సమీర కర స్పర్శలో ఊయల లూగుచూ పులకించి గుబాళించు విరుల మంజరులు అపరాహ్ణ సూర్యాతపములో వాడి వత్తలై రాలి ధూళిలో పొర్లాడుచున్నవి. అట్లే మానవ జీవితమం దెల్లెడ కలిమిని వెన్నంటిలేమి, మోదమును వెన్నంటి ఖేదము, జననమును వెన్నంటి జరా రోగ మృత్యు

వులు నిరంతర పోరాటము సలిపి జీవితములను దుఃఖ భాజనము చేయుచున్నవి. లోకమున పరిపాలకులకు కొదువ లేదు; పండితులకు లోటులేదు; భుజబలములు ప్రదర్శించి బిరుదులందు మేటి పోటరులకు అంతులేదు. కాని సాటి ప్రాణికోటి దుఃఖము పోదోలుటకై పాలకులు యత్నించరు, పండితు లాలోచించరు, వీరులు పాటు పడరు.

విద్యాభ్యాస కాలమునుండియు సిద్ధార్థు డీ దుఃఖాంధ తమస్సునుండి వెలువడి జీవకోటి నిరతానంద జ్యోతిని దర్శించి తరించలేదా యని తలంచుచుండెడివాడు.

సిద్ధార్థ రాకుమారు డొకనాడు హిమాలయారణ్య భూములలో వేటకై చని ఒక సెలయేటి దరిని శాద్వలాంకూర ములు తినుచున్న లేడిని చూచి నారెసారించి శరసంధాన మొనరించెను. కనుఱెప్పపాటు కాలములో ఆ జింక రాజ పుత్రుని యత్నమును గ్రహించి ప్రాణభీతిచే పారిపోవ దొడగెను. రాకుమారు డా యిట్టి దయనీయ వర్తనకు జాలి పడి వేటమాని నగరమున కేగెను. వేరొక పర్యాయము మిత్రుల ప్రోత్సాహంతో గుఱ్ఱపు పందెములయందు పాల్గొని సంపూర్ణ విజయుడయ్యెను. కాని ఆతనికి విజయానందము కలుగలేదు. మీదుమిక్కిలి విచార హేతువే అయినది. తనకు విజయము కలిగించిన ధవళాశ్వము సంకేత స్థలమును చేరి రొప్పుచుండ సిద్ధార్థుని హృదయము ఖేదమయమై

పోయినది. నా విజయ ప్రశంసలకై నిన్ను కష్టపెట్టితిని కదా" యని తురగమును నిమురుచు పరితపించెను.

ఒక నూతన వత్సరారంభవేళ కపిలవస్తు నగర బాహ్య ప్రదేశమునందు జరుపబడు హాలకర్షణోత్సవమును నిర్వహించవేగు శుద్ధోదనుడు కుమారుని వెంట తోడ్కొని వెళ్ళెను. అచట సమావేశమైన రైతులు హల పూజచేసి భూమిని దున్నుచుండగా అనేక జీవసంతతులా నాగలి కొనచే తెగి మరణించుచుండ వినువీధి నేగు శ్యేనాది పక్షులు వానిని పట్టి తిన సాగినవి. ఆ మారణక్రియ చూచి హర్షించలేక దయార్ద్ర హృదయుడగు సిద్ధార్థుడు గృహాభిముఖుడై వెడలి పోయెను. మరియొక దినమున సూర్యభగవానుడు చరమగిరి చేరువేళ నెచ్చెలులతో కలసి సిద్ధార్థుడు నగరు వెలుపలగల కాసార తీరమందలి పచ్చికపై విశ్రమించి ప్రకృతి రమ్యావలోకనుడై వినోదించుచుండెను. ఆకసమున కొన్ని రాయంచలా నీరెండలో మానససరోవరము దెసకు బారులు తీరి ఎగసి పోవుచున్నవి. అచ్చట నున్నవా రందరు వానిని చూచి స్వేచ్ఛామయ జీవితమును మెచ్చుకొనుచుండ కఠిన చిత్తుడైన దేవదత్తుడు సిద్ధార్థుని పిన తండ్రి కుమారుడు విల్లమ్ము లందుకొని గురి చూచి ఒక మరాళిని నేల గూల్చినాడు. ఏ పాప మెరుగని రాజహంస క్రూర శరాహతికి గురియై క్రీంకారము చేయుచు సిద్ధార్థుని కట్టెదుటపడి కొట్టుకొను

చుండ దయామయు డద్దానిని పట్టుకొని బాణము తొలగించి ఋజ్జగించి చికిత్సచేసి కొన్ని దినంబులకు పూర్ణారోగ్యము చేకూరినంతనే వినువీధిని యథేచ్ఛగా చన విడచినాడు.

భూత దయాపరుడగు తనయుని వైరాగ్యచింతనను గమనించుచుండిన శాక్యరాజు కుమారుని జన్మపత్రికా రచన వేళ దైవజ్ఞులు చెప్పినట్లు సర్వసంగ పరిత్యాగి యగునేమో యని దిగులు పడజొచ్చెను. నవయౌవనుడగు కుమారునకు వివాహ మొనర్చి రాజ్యభార మప్పగించినచో ఈ వైరాగ్య చింతన నశించగలదని యూహించెను.

శుద్ధోదను డొకనాడు ఏకాంతమందున్న సిద్ధార్థుని చేర బిలిచి గార్హస్థ్య ధర్మావశ్యకతను బోధించి కన్య నన్వేషించు తలంపు తెలిపెను. సిద్ధార్థుడు తన సమ్మతిని తెలుపుటకు గడువుకోరెను. ఆ వ్యవధియందాతడు తన సంకల్ప మీడేర వలె ననిన గృహస్థాశ్రమమే మేలని భావించి పితృదేవునకు కన్య నన్వేషించుటకై తన సమ్మతి తెలిపెను.

# 3

దైవజ్ఞులు నిర్ణయించిన దినమున శాక్య రాజన్య నింట అశోక భాండోత్సవమునకై వలయు పరికరములు సమకూర్చబడినవి. సమస్త భారతావని యందలి రాకుమార్తెలాహ్వానించబడిరి. సిద్ధహస్తులైన శిల్పులు, చిత్రకారులు నేర్పుమై రచించిన స్వయంవర సభాగారము విశిష్ట చిత్ర శిల్పములతో మయసభయోయన విరాజిల్లు చున్నది. తనకై నిర్మించబడిన రమణీయాసనముపై సిద్ధార్థు డుపవిష్టుడయ్యెను. అతని సమీపమున లెస్సగా అమర్చబడిన బంగారు పాత్రలలో అశోక కుసుమ మంజరు లమర్చి వేదోక్తముగా పూజించి రాచకన్నెలకొసంగ పురోహితు డనుజ్ఞ నొసంగెను. ఒక్కొక్క సుమకోమల సుందరాంగి వచ్చి మ్రోల నిలువ రాకుమారు డొక్కొక హేమభాండ మొసగుచుండెను. క్రమముగా ఆహూయమానలైన రాజపుత్రికలు హేమభాండము లందుకొని విడిది గృహముల కేగుచుండిరి. అశోక భాండోత్సవము ముగియుచున్నను యువరాజు హృదయ మే సుందరాంగి యందును లగ్నము కాలేదు. సభయందున్న పెద్దలు వెరగుపడి చూచుచుండిరి. ఇంతలో నొక పూర్ణేందువదన విద్యుల్లతాంగి దేహకాంతుల కాలచంద్రికల నీన సహజ లజ్జావనత

వదనయై రాకొమరుని సమక్షమున కేతెంచి కను రెప్పపాటు కాల మాతని మోము తిలకించినది. ఆ భువనైకసుందరి వాల్చూపు తూపు శోభనాకారుడై యున్న యువరాజు ధైర్య కంచుకమును చెండివైచినది. క్షణకాల మాతడు కింకర్తవ్య మూఢుడై యుండి ఉత్తర క్షణమున తా నొసగబోవు అశోక భాండముతోపాటు తన యెద నలరారు హేమమణిమాల తీసి ఆ కన్యామణి కంఠసీమ నలంకరించెను. ఆ వసుధైకసుందరి దండపాణి తనూజ; చందనపు బొమ్మ; సార్థకాఖ్య యశోధరాసాధ్వి మిన్న.

శుద్ధోదనుడు పరమానంద భరితుడై దండపాణి కీ వార్త తెలియజేసెను. దండపాణి శాక్య రాజన్యునితో వియ్య మబ్బినదని విని ఉబ్బి తబ్బిబ్బు పడక "నేను యేర్పాటు చేయు స్వయంవర సభకు వచ్చి అందు మాచే నిర్ణయించ బడు వివిధ విద్యా ప్రవీణుల నోడించి నే నొసగు అర్థ రాజ్యముతో నా ప్రియ తనూజయగు యశోధరను స్వీకరించ వలసినదిగా కోరెను.

సిద్ధార్థుడందుకు పూర్ణాంగీకారము తెలుప శుద్ధోదనుడు కుమార సంయుతుడై మంత్రి సామంత హితాది బంధు వరు లెల్లరు వెంటరాగా నియమిత కాలమునకు దండపాణి నగరు చేరెను. దండపాణి పరివార సమేతుడై వచ్చిన శాక్యనృపతికి యుథోచిత సత్కారము బొనరించెను. పరీక్షార్థమై నిర్ణీత దిన

మందు జరుపబడిన నిండుసభలో సిద్ధార్థుడు తన సర్వ విద్యా ప్రావీణ్యముతో వేదశాస్త్ర పురాణ కోవిదులను, జ్యోతిష ఛందో వ్యాకరణాలంకార తార్కికాది పండితులను, నిరుత్తరుల చేయుటయేగాక గదా - ఖడ్గ - మల్ల యుద్ధములలోను, గజాశ్వ చోదకత్వములో, శరప్రయోగ పాటవములో ప్రత్యర్థుల నోడించి దండపాణి మన్నలకు విశేష పాత్రుడై యశోధరా పాణిగ్రహణము చేసెను.

యశోధరా సిద్ధార్థుల కళ్యాణము దివిజ సన్నుతముగా జరుపబడినది. శుద్ధోదనుని మానస మానంద సంభరిత మయ్యెను. రాజధాని యందెందు విన్నను యశోధరా సిద్ధార్థుల కళ్యాణ వైభవ ప్రశంసలే వినవచ్చుచున్నవి. చక్రవర్తి తనయు డికనైన లౌకిక చింతనా పరాయణుడై యుండ గలందులకు పలయు యేర్పాట్లు చేయించెను. ఋతువుల పరివర్తనలో సుతుని ఆనందము కొరవడి విరక్తి మార్గము పట్టకుండుటకై పలయు రమణీయ హర్మ్యములు, సుందరారామములు, క్రీడా సరస్సులు నిర్మింపజేసి మానవ జీవితము నిరతానందమయమే అనుకొనునట్టి దివ్య భోగములు సమకూర్చుచుండెను.

కాలచక్రము తిరుగుచున్నది. దినములు వారములై, వారములు నెలలై, నెలలు వసంతములై నిర్గమించిపోవుచున్నవి. ప్రణయుని గాఢ పరిష్వంగ సుఖలాలసుడై బాహ్య

లోకము నెరుగకయే సిద్ధార్థుడు కొంతకాలము గడపెను. పతిపాదసేవా పరాయణురాలైన యశోధరాదేవి గర్భవతియై అమృతముతో నిండిన హేమపాత్రవలె ద్విగుణీకృత తేజో వతియై ప్రకాశించుచున్నది. రాజు, రాజబంధువులు పొందు ఆనందమున కవధులు లేవు.

## 4

పరిమళ సుమము నెంత మరుగున దాచియుంచినను దాని సౌరభము వెలికి చిమ్మకపోదు. జ్ఞాన భాస్కరుని అజ్ఞానజలుద పటలి నిత్యమూ క్రమ్మి నిలువలేదు. కొలది కాలము అంతఃపుర కాంతా వినోదవిహార నిమగ్న మానసుడైన సిద్ధార్థుడు తిరిగి కాలవాహినివైపు కన్నెత్తి చూడగలిగెను. ఒకనాడు రథ చోదకుడైన ఛన్నుని పిలిపించి రథ మలంక రించి తోలుకొని రమ్మనినాడు. ప్రభుభక్తి పరాయణుడైన సారథి అలంకరించి దెచ్చిన అరదము నెక్కి నగర సందర్శ నార్థమై బయలుదేరినాడు.

కపిల వస్తు నగర వీధులనుండి సర్వార్థసిద్ధి రథము సాగిపోవుచున్నది. సువిశాల సౌధాలంకృతమైన రాజ్ఞగరి దాటి విపణి వీధిని గమించి పోవుచున్నది. ఇంతలో దూర

పరివృత దుర్గంధ దేహుడైన కుష్ఠురోగి యెదురయ్యెను. రాకుమారుడు విస్మితుడై ఆత డెవ్వరు? అట్లుండుటకు కారణ మేమి యని ఛన్నునడిగెను. "అతడొక కుష్ఠురోగి" ఆ రోగమునకు గురియైన వారు ఈ జన్మలో తిరిగి అరోగ్యవంతులు కాలేరని ఛన్నుడు సమాధాన మొసగెను. మరికొంత దవ్వేగుసరికి తిరిపమెత్తుకొను ముసలివా డొకడు వంగిన నడుముతో నడువలేక నిలుచుచు ఎదురు పడెను. వేరొక వీధి యందు వికలాంగుడు, మరియొక వాడయం దొక ఇంటి ముందప్పుడే మరణించిన మృత కళేబరముపైబడి యేడ్చు భార్యా బంధుమిత్రులను చూచి దయామయుడయిన సిద్ధార్థుడు ద్రవీభూత చేతస్కుడై తడి కన్నులతో ఆ దృశ్యమును గురించి ప్రశ్నించగా ఛన్నుడు "ప్రభూ! ఈ లోకమందెల్లరు ఒకే విధముగా జన్మించరు. కొందరు వికలాంగులై పుట్టెదరు; మరికొంద రనేక దుస్సంఘటనలచే వికలాంగులయ్యెదరు. వా రాజన్మాంతమట్లే యుండక తప్పదు. ఎంత గొప్ప వారైనను కాలక్రమములో వృద్ధులై పోవుదురు. రోగ పీడితులై మరణింతురు. విశ్వమందలి దేహధారులందరు కలిమిలేముల సంఘర్షణలో నలిగిపోయి తుట్టతుదకు జరారోగ పీడితులై మరణింతురు. యుగయుగాలనుండి యీ వలయములో పడి ప్రాణికోటి యాతన లనుభవించుచునే యున్నది. ఈ దీన దశనుండి తప్పించ జాలు మార్గమాలోచించు వారు లేరు" అని పలికి గుఱ్ఱముల నదలించెను.

రథము పట్టణము దాటిపోయినది. నగర బాహ్యమున తరుణ సహకార వనమొకటి సుందరస్యందనారూఢుడై యున్న రాకుమారునకు నేత్ర పర్వము గావించినది. అందొక మామిడిచెట్టు క్రింద పద్మాసనము వేసి కన్నులు మూసికొని యున్న సాధుపుంగవుని చూచి ఆతడెవ్వరని సారథి నడిగెను. సారథి "రాకుమారా! అతడొక యోగిపుంగవుడు. ఆయన యీ ప్రాపంచిక చింతలలో చిక్కుపడక కేవలము దైవిక ముగా లంభించిన ఆహారముతో తృప్తిపడుచు కావి గుడ్డలు కట్టుకొని నిర్వికార హృదయుడై నిరంతరము దైవచింత నలో మునిగి తేలుచు జన్మరాహిత్యమునకై తప మొనర్చు చున్న ధన్యజీవి" అనెను. గడచిపోయిన విషాద దృశ్య సందర్శనముచే చింతాక్రాంతమైయున్న రాకుమారుని మదికి చరమ దృశ్య వివరణము అమృత సేచనమై వెలుగు బాటయై విలసిల్లినది.

సూర్యభగవాను డస్తమించినాడు. విశ్వమందెల్లెడ సంజ చీకటు లలముకొన్నవి. సిద్ధార్థుడు రథము వెనుకకు మరల్చ నాజ్ఞ యొసంగినాడు. ముందు చూచిన దృశ్య సమూహమునకు పొడమిన విచారమువలె నున్న మనసక చీకటిని పోగొట్టి మౌని దర్శనముచే కలిగిన జ్ఞాన తేజము వలె పూర్ణచంద్రుడు ప్రాగ్దిశ నలంకరించినాడు.

సిద్ధార్థు డెప్పటివలె అర్ధాంగితో, బంధుమిత్రులతో సేవకులతో సలాపములాడుచు మెలగుటలేదు. సదా ఏకాంత

మందిరమందే యుండుచు లోకశోకాంత మార్గావలోకనమునకై యోచించ గడగినాడు.

ఒక శుభ దినమున యశోధర చక్కని మగబిడ్డను కనెను. పౌత్రోదయ వార్త విని శుద్ధోదనుడు పొంగిపోయెను. బంధుమిత్రులు, పరిజనులు పరమానంద భరితులైరి. కాని యువరాజు వదనమం దెట్టి యానందరేఖలు పొడగట్టలేదు.

## 5

రాజనగరెల్ల పుత్రోదయానందోత్సవములతో కళకళ లాడుచున్నది. దినమున కొక్కొక్క రీతిని నృత్యగాన వినోదములు జరుపబడుచున్నవి. సకల రాజ పరివార మందు పాల్గొని వేనోళుల వినుతించి ఆనందించుచున్న [redacted] మా వైపునకే వెళ్ళుటలేదు. తనయుని నిర్లిప్తత చూచి శుద్ధోదను డాందోళన పడసాగెను. చివరి కొకనాడు సిద్ధార్థుని యేకాంత మందిరమున కేగి కుశల ప్రశ్న గావించి "కుమారా! నేను పెద్దవాడనైతిని. రాజ్యపాలనా భారము నిర్వహించలేకున్నాను. నీవు సర్వజ్ఞుడవు; సకల విద్యా విశారదుడవు. నీ వెరుగని ధర్మములు లేవు. మన ప్రజలందరు

ఆనందముతో నీ పాలన కెదురు చూచుచున్నారు. మన పూర్వులచే స్థాపించబడిన ఈ రాజ్యము వైరుల కభేద్యమైనది. నీ వీ విస్తృత రాజ్యమున కభిషిక్తుడవై న్యాయ పాలన మొనరించుచు నాకు సంపూర్ణ విశ్రాంతి నొసంగుము. నా శేష జీవిత మంతయు శ్రీమన్నారాయణ చరణ సేవాంకితము గావించి తరించ యత్నింతును. మన కుటుంబములో రాజ్యపాలన మొనరించిన పెద్ద లీ యీడుకే జ్ఞాన వృద్ధులై కమలనాభుని మృదు పాద కమలములను స్మరించుచు చరమ జీవితము గడపిరి" అని అమితానురాగ తరంగిత హృదయుడై పలికెను. సిద్ధార్థుడు తండ్రి మాటలు భక్తితో విని యిట్లనెను.

"తండ్రీ! లోకమం దెందు చూచినను జరారోగ మృత్యు చింతాక్రాంత సంకుల సమరమేగాని, నిరతానందము కాన రాదు. ఈ సామ్రాజ్యములు, రాజభోగములు క్షణ భంగురములగు జల బుద్బుద ప్రాయములు. ప్రాణికోటిని వెన్నంటి పట్టి పీడించి దిగమ్రింగు మృత్యువునకు మృతిలేదు. అనంత కాల వాహినిలో జరారోగ మృత్యువుల సంకుల సమరము నడుమ నలిగి తమను తాము కాపాడు కొనలేని చక్రవర్తులు సకల మానవాళిని సుఖపెట్టగల పరిపాలకులమని చాటుకొనుట స్వీయాత్మ వంచన చేసుకొనుట కాదా ? నేను తమ్ము సుఖ పెట్టగలనని నమ్ముకొనిన ప్రజల భవరోగ దుఃఖములను బాపుటకై మృతికి అతీతమైన దివ్యమార్గము కనుగొనవలెను.

అట్టి పవిత్ర కార్యాచరణ సర్వసంగ పరిత్యాగియే చేయ గలడు కాని భౌతికానంద లంపటులైన సంసారులు, సార్వ భౌములు చేయలేరు. నేనా విశిష్ట కార్యాచరణకై సర్వము త్యజించ దలచితిని. కావున నీ యాజ్ఞను సిరసావహించ లేనందుకు క్షమించమని మ్రొక్కి మిన్నకుండెను.

శుద్ధోదనున కీమాటలు పిడుగు పాటులైనవి. దుఃఖము పెల్లుబికి రాజొచ్చినది. అయినను రాజ్యపాలనా ధౌరేయు డగుటచే హృదయాంతర సంతాపమును అణచుకొని దయ నీయ దృక్కులతో కుమారు నవలోకించి యిట్లనెను.

"తనయా! నీవు రాజ్యమేల దగిన రమణీయుడవే కాని వన భూములలో ఇడుములననుభవించుచు ఘోరతపము చేయ నేరని సుకుమార జీవివి. నిన్నే దైవముగా తలచి నీ సాన్ని ధ్యమునే స్వర్గధామముగా భావించి పూవులో లీనమైయుండు తావిరీతి మెలగుచు నీ యెడబాటుసైపనేరని సుకుమార సుగుణరాసి యశోధర ముక్కుపచ్చలారని ముద్దు బిడ్డతో నీ వియోగాగ్నిబడి తపించి విలపించుచో ఈ వృద్ధాప్యమున చూచుచూ ఎట్లు జీవించగలనో యోచింపుము. యుగ యుగాల నుండి జగతిలో సాగుచున్న జరారోగ మృత్యు సంకుల సమరము నరికట్టి మానవకోటిని నిరతానందకర మోక్ష ధామమున నిలువజేయుట ఒక మానవ మాత్రునకు సాధ్య మగునా? ఎందరెందరో మహామహులు సివలెనే తలపోసి సర్వము త్యజించి తపమున ఫలసిద్ధి పొందలేక రెంటికిం

జెడిన రేవనిరీతి భ్రష్టులౌట తరుచు వినుచున్నాము కదా! వయోవృద్ధుడనైన నా పలుకు లాదరించి సావధానముగా యోచించి సన్యాసాశ్రమ స్వీకార వాంఛను విడువుము. విస్తృత రాజ్యలక్ష్మిని స్వీకరించుము” అని ప్రాధేయపడుచు కంపిత గాత్రముతో, తడి కన్నులతో తన సౌధమునకు వెడలెను.

లోకజ్ఞుడైన జనకుని దయనీయ హృదయ వేదనా భరితోక్తులు సిద్ధారుని మానసము నామూలచూడముగా కదలించివైచినవి. మరికొన్ని దినముల వరకాతడే నిర్ణయ మును చేయలేక యేకాంత గృహమున ఆలోచనా సాగర మున మునిగి తేలుచు గడపెను. తుట్టతుదకు సకల సందేహ లతా వితానమును దృఢ సంకల్పాసిచే చెండివైచి సర్వసంగ పరిత్యాగ పథమున పదమూని నిలద్రొక్కుకొన దృఢ నిశ్చయుడయ్యెను.

## 6

అది అర్ధరాత్రి; అంతఃపుర కాంతాజనమెల్ల ప్రొద్దు పోవు వరకు నాట్యాది వినోదముల నవలోకించి మైమరచి నిద్రించుచుండిరి. సిద్ధార్థుడు మాత్రము నిద్రాదేవి కౌగిలిలో

చిక్కలేదు. అతడు మెల్లన పాన్పునుండి లేచి శయన మందిరము కలయ జూచినాడు. పాలవెల్లివలెనున్న పాన్పుపై బాహ్య జగద్విషయ మెరుగక నిర్విచారముతో నిద్రించు చున్న హృదయేశ్వరి యశోధరను, ముద్దులమూట వలెనున్న రాహులుని చూడగనే ఊహాకందరాని మోహపాశ మొక క్షణకాల మాతని బంధించి నిలపినది. పసిబిడ్డ నెత్తుకొని ముద్దాడ మన మారాటపడినది. కాని; ఆట్లొనర్చిన యశోధర మేల్కాంచుననియు తన యత్నమంతయు భగ్నమైపోవు ననియు భావించి హృదయమును కుదురు పరచుకొని మెల్ల మెల్లన శయన మందిరము వీడి కక్ష్యాంతరములు గడచి ప్రాకారములు గమించి రాజ వీధిని దాటి గుఱ్ఱాలశాలనుచేరి అందు నిద్రించుచున్న ఛన్నుని లేపెను. అర్ధరాత్రివేళ పాద చారియై యువరాజు అశ్వశాలకు వచ్చుట కని ఛన్ను డాశ్చర్య చకితుడై వెనువెంటనే "ప్రభూ! ఈ కటిక చీకటిలో కాలినడకను యింత దవ్వేల వచ్చితి"రని యడిగెను. సిద్ధార్థుడు "ఛన్నా! నీ కన్ని విషయములు సాంతముగా తెలిపెదను. జాగుచేయక నా శ్వేతాశ్వము నిటకు తెమ్ము; నీవు నాతో రమ్ము" అని హెచ్చరించ సారధి యువరాజు ఆనతి శిరసావహించి నునుజీనుతో నమర్చిన వెల్ల గుఱ్ఱమును తెచ్చి ఎదుట నిలిపెను.

సిద్ధార్థుడు ధవళాశ్వమునెక్కి కపిలవస్తునువీడి నైఋతి దిశగా యాత్ర సాగించినాడు. ఛన్నుడు వెన్నంటి సాగి

పోయినాడు. తూర్పున ఉషోరేఖల ధవళ యవనికలు తొలగు వేళకు వారు "అనమా" నదీ తీరమునగల రసాల వనమును చేరిరి. ఆ మామిడితోట యందొక నిగూఢ ప్రదేశమున సిద్ధార్థుడశ్వమునుండి దిగి ఛన్నునితో యిట్లనెను. "ఛన్నా! పితృదేవుడీ మధ్య నాకు రాజ్యభారము నప్పగించ యత్నించుచున్నాడు. లోకమందలి ప్రాణులెల్ల చావుపుట్టుకల కోనలోబడి తప్పించుకొను తెరవుకానక తపించి పోవుచున్నవి. పాలకులధికార గర్వాంధులై తమ్ము సేవించు ప్రజల శ్రమాఫలమును జైవనము గావించుకొని రాజ్య విభవముల జుఱ్ఱుచు విఱ్ఱవీగుదురేకాని జనతా దీన దశా సంతరణోపాయమునకై యోచించువారు లేరు. జగమంతయు వర్ణ, వర్గ తరతమ భేదవాద మారణ సంగ్రామమైయున్నను మనకేమి యని తొలగి చనువారేకాని దృఢచిత్తులై నిలచి విశ్వమానవ కళ్యాణ పథాన్వేషణకై పాటు పడువారు కానరారు. కావున నేనీ జరామరణముల కతీతమైన దివ్యధామ పథమును కాంచి సకల మానవానీకమును తరింప చేయుటకై గృహ పరిత్యాగ మొనరించి వచ్చితి"ననెను. యువరాజు వాక్కులకు ఛన్నుడు నిర్విణ్ణుడై పెదవి విప్పలేక కన్నుగవ చెమ్మగిల్ల కంపిత స్వరమున నిట్లనెను.

"ప్రభూ! చిరకాల తపః ఫలముగా జన్మించిన నిన్ను తన బహిఃప్రాణముగా భావించి పెంచి పెద్దవానినిగా చేసిన నీ తండ్రిగారు నీ నిష్క్రమణ వార్త నాలకించి ధరణిపై

నిలువగలరా? నిన్నే దైవముగా నెంచి సేవించు యశోధరా సవిత్రి నీ వియోగ వార్తా శరాహతికి గురియై ప్రాణములతో జీవించి యుండునా? ఏ పాపపుణ్యముల నెరుగని పసిబాలు నీ కుమారుడు నేడో రేపో నడక నేర్చి మాటలు నేర్చి ఏడీ! మా నాన్న? ఎక్కడ! అని యడిగిన యేమని చెప్పి యూరడించగలము? నీ వీ సర్వసర్వంసహా చక్రవర్తివై మమ్ము సుఖపెట్టగలవని నమ్ముకొనిన మాకింక దిక్కెవ్వరు?" అని వాపోవ దొడగెను.

స్వామిభక్తి పరాయణుడగు ఛన్నుని దీనాలాపములకు సిద్ధార్థుని డెందమేగాక పరిసర ప్రకృతి మాతయు ద్రవించి పోయినది. తొలుత నేమియు చెప్పలేక పోయినను వెసు వెంటనే ధైర్యము వహించి "ఛన్నా! మిమ్మెంతగనో సుఖపెట్టగలనని నమ్ముకొనిన మీ భవరోగ మృత్యు శోకముల బాపలేక గద్దె నాశించుట కృతఘ్నతా భరితమైన స్వార్థము కాదా? నేడు నా యీ దీక్ష విడువక భవరుజామృత్యు భయద దానవుని పట్టివధించగల వైదువులను సాధించి తెచ్చి యిచ్చి నరజాతి కోమల హృదయ పీఠమునెక్కి శాశ్వతముగా పాలింతును. నీ వీ గుఱ్ఱమును తోడ్కొని నగరికి వెడలుము" అని పలికి రాజలాంఛనములెల్ల తీసి ఛన్నునకిచ్చి మొలనున్న ఛురికతో శిరోముండనము గావించుకొని ఆ దారిని పోవుచున్న బోయ వానిని చేరబిలిచి తన పట్టుపుట్టము లాతని కిచ్చి వాని జీర్ణ వస్త్రములు కోరి తీసుకొని ప్రీతితో ధరించెను. ఛన్ను డా

దృశ్యమంతయు కన్నుగ నీర మురలగా కని రాజధానికేగెను. విశ్వమానవ కళ్యాణ పథాన్వేషణా కాంక్షతో సకల రాజ్య సంపదను తృణప్రాయముగా భావించి త్యజించిన సిద్ధార్థుడు గౌతముడై తన్నారు లెరుగని తెరగున భయదాటవీ మార్గమున సాగిపోయెను.

## 7

గౌతముడు తొలుత వేదార్థ విదులైన మునివరుల కాటపట్టగు ఒక మునిపల్లెలో కొంత కాలము నివసించి వారి నిరంతర కార్యకలాపములలో పాల్గొనెను. గౌతముని దివ్య తేజము, ఋజువర్తనము, జ్ఞానతృష్ణ నిరుపమాన వైదుష్యములను చూచి శతవృద్ధులైన యతివరులే నివ్వెర పడసాగిరి. "శాక్య, పద్మ"లను యిరువు రాదర్శ ముని పత్నులు గౌతము డం దున్నంత కాలము భక్తి శ్రద్ధలతో సేవించిరి. అత డా వేదవిదుల మంత్ర తంత్ర సాధనలతో తనియక మగధ రాజ్యాభిముఖుడై వెళ్ళెను. మార్గమధ్యమున రౌవతుడు, రుద్రకుడు, అరాడకాముడు, అను మహాపండితుల ఆశ్రమములలో కొంతకాలముండి వారు చేయు మోక్షసాధనము లన్ని కరతలామలకము గావించుకొని అవియెల్ల శుష్క సాధనలుగా నిర్ణయించుకొని మగధ రాజధానియగు రాజ

గృహ సమీపారణ్య మందలి రత్నగిరి కందరమున నివశించుచు కొంతకాలము యోగసాధన చేసెను.

అది మండు వేసవి కాలము. ప్రచండ సూర్యాతపములో ప్రాణికోటి తపించి పోవుచున్నది. ఒకనాటి మధ్యాహ్న కాలమందు గౌతముడా రత్నగిరి సానువుయందున్న సెలయేటి నుండి తానుండు గుహకు వచ్చుచుండెను. దారియందొక దయనీయ దృశ్యమును గాంచి నిలిచెను. కొందరు గొల్లలా మండుటెండలో మేకలను తోలుకొని పోవుచుండిరి. ఆ సాధుజీవులా మండుటెండలో రొప్పుచు,రోజుచు నడువలేక నడచుచుండ కాపరులు అదలించి వడిగా పరుగెత్తించుచుండిరి. గౌతముడు వారిని చూచి "నాయనలారా! ఇట్టి అకాలమున నేల మందలను యింటికి తరలించుచున్నారు? కారణమేమి?" అని అడిగెను. కాపరు లబ్బురపాటుతో గౌతముని చూచి "స్వామీ! మీరెరుగరా? మా బింబిసార మహారాజుగారు గొప్ప బలియాగము చేయుచున్నారు. దేశమందున్న మీ వంటి పెద్దలందరు అచ్చటికే వచ్చియున్నారు. నిత్యము అటకి రాజ్యమందున్న గొల్లలందరు వంతుల ప్రకారము కొన్ని మేకలను తోలుకొని వెళ్ళవలెను. ఇది రాజశాసనము. నేడు మా వంతు వచ్చినది. క్షణ మాలస్యమగునేని ప్రభువు లాగ్రహింతురు" అని చెప్పి మందను వడిగా తోలుకొని పోవుచుండిరి.

దయామయుడగు గౌతము డా ఛాగపాలకుల మాటలు విని నిలువునా చలించిపోయెను. "ఔరా ! పాలకులే కృపా విహీనులై ఇంతటి ఘోర హింసాకాండకు పూనుకొన్నచో ప్రజలెట్లు చరింతురు ? ధర్మమెట్లు నిలచును ! దీన రక్షణ మే రీతి జరుగును ?" అని వితర్కించుకొని తన యోగసాధన కన్న ప్రాణిహింసా నివారణయే పరమోత్కృష్ట ధర్మముగా భావించి మందతో నడువలేక కుంటుచు వెనుకబడి కాపరిచే దెబ్బలు తినుచున్న గొఱ్ఱెపిల్లను మూపున నిడుకొని నిరా ఘాట జవముతో బింబిసారుని బలియాగశాల చేరెను.

ఆజానుబాహుడై శరదిందు సంకాశతనుడై, కాషా యాంబరధారియై గొఱ్ఱెపిల్లను భుజమున నిడుకొని వచ్చు చున్న మహిత తేజస్వియగు గౌతముని కాంచి పౌరులెల్లరు నివ్వెరపోయి చూచుచు యీత డెవరో దివ్యపురుషుడు కాని మానవమాత్రుడు కాడని వినమ్రులై మ్రొక్కి అంతరంగమున నుతించసాగిరి. గౌతము డెవ్వరిని పలకరించక పరితప్త హృద యముతో సరాసరి యాగశాలలో ప్రవేశించెను.

యజ్ఞ వేదికపై హోమాగ్నులు ప్రజ్వరిల్లు చున్నవి. ఋత్విజుల మంత్రగానములు మిన్ను ముట్టుచున్నవి. మరుక్షణమున ప్రాణము విడవలసియున్న మేషము యూప స్థంభమున బంధించబడి యున్నది. ఆ దృశ్యము దృగ్గోచర మైనంతనే కన్నీటి ధారతో గౌతముడు శరవేగముతో వేదిక

పైకేగి "మహారాజా! ప్రాణిహింస మహాపాతకము. ఈ సాధుజీవుల రక్షింపుము. పరలోక భోగ కాంక్షతో ఇహ లోకమున రక్తపాతము గావించుటకన్న అజ్ఞానమయ నరక హేతువు వేరే యున్నదా? లంచమిచ్చి దేవతలను మెప్పింతుమని భావించుట కేవల మాత్మవంచనయే యగును. ధర్మ నిర్ణేతలైన దేవతలే లంచగొండులై మన పాపములను మరుగుపరచి పక్షపాతపు తీరుపు లిచ్చిన లోకమున ధర్మ మెట్లు నిలచునో యోచించవద్దా! జ్ఞానమూర్తులైన పండిత మండనులే యిట్టి ఘోర హింసలకు పురికొల్పిన సామాన్య మానవులు చేయని దేముండును? ఓ వేదవిదులారా! "అహింసా పరమోధర్మః" అను పవిత్రోక్తి మీరెరుంగనిదా! భూతదయా పరతంత్రత కన్న ఉత్కృష్ట ధర్మ మెందైన కలదా? మెడను తెగకోసిపైచిన మేక నొక్కదానినైనను బ్రతికించలేనినాడు యీ తాంత్రిక మంత్రసాధన కంటి కగుపించనట్టి లోకముల నే రీతి చేర్చజాలునో యోచించవలదా?" అని గంభీరముగా పలికెను. బ్రాహ్మణ పండితులందరు లజ్జావనత వదనులై యూప స్థంభముననున్న మేకను విడచిపెట్టి హోమాగ్నుల నార్పివేసిరి. బింబిసారుడు తా నొనరించిన మారణ హోమ క్రియా పాప పరితప్త హృదయుడై దిగ్గున లేచి వచ్చి గౌతముని పాదములపైబడి తరుణోపాయ మెరిగించుమని వేడుకొనెను. గౌతము డాతనికి అహింసా సత్య

ధర్మ సంరక్షణమే నరపతులకు అవశ్యాచరణీయ ధర్మమనియు జన్మసార్థకతకు మూలమనియు బోధించి ఆ రాజు మన్నన లంది వెడలిపోయెను.

గౌతముడు మగధ రాజధానియగు రాజగృహము వీడి గయాశీర్ష పర్వతమునకేగి అందు కొంతకాలము తపస్సు చేసెను. అం దాయన లక్ష్యము నెరవేరలేదు. నిర్వాణపథ సందర్శనము కాలేదు. అంత నత డచ్చోటు విడచిపోయి నైరంజరా నదీ తీరమునందున్న ఉరువేల (ఊరుబిల్వ) గ్రామ పరిసరారణ్యమున గల ఒక మఱ్ఱిచెట్టు నీడన నివసించుచు శీతాతపములను లెక్కచేయక వాయుభక్షణముతో తనువు నిలుపుకొనుచు ఆరేండ్లు ఘోరతప మొనర్చెను. గౌతముని మనోభీష్టము నెరవేరలేదు. మరికొంత కాల మట్లే యున్నచో దేహమున ప్రాణము నిలుచుట అసంభవమని చూచినవా రనుకొనురీతికి గౌతముడు వచ్చెను.

తపోమయుడై యున్న గౌతమున కొకనాటి నడిరేయి వినువీధినుండి వీణానాదము వినవచ్చెను. ఆ వీణారావములో లయాన్వితముకాని అపశ్రుతులు మిళితమైయున్నవి. యిరువంకల నుండు పల్లకీ తంత్రులు వదులై గానము క్రమము తప్పుచున్నది. గౌతము డా జంత్రగాత్రమును చక్కగా అన్వయించి చూచెను. దేహము తన పనిని కొనసాగించనిచో దేహి యేమియు ప్రకటించలేదు. ఆకురాల్చిన తరు లతాదులు

తిరిగి పల్లవించుట కననగుచున్నదేగాని ప్రాణము విడిచిన మేనునందు తిరిగి ప్రాణము పోయు ఘనులు కానరారు. కేవల శుష్కోపవాసములచే శిథిలమగు మేను కొంత కాలమునకు తన పనిని వదలిపెట్టి మట్టిపాలగును. అటుపై సాధించగలిగిన దేముండును? కావున కార్యసాధనకు దేహపోషణము కూడ అవసరము. అట్లుకాని నా యీ సాధనయు ఫలించదని భావించి కనులు తెరచి చూచెను.

8

ఊరువిల్వ గ్రామమందొక ఆదర్శ కృషీవలుడుండెను. అతని భార్య సుజాత. పతిభక్తి, దైవానురక్తి, భూతదయాపరత, దీనజనాదరణ మున్నగు మేలి గుణములు కల పరమసాధ్వి. ఆ దంపతుల కెంత సంపదయున్నను సంతాన భాగ్యము లేకుండెను. వయసు మీరు కొలది సుజాత మదిలో సంతానకాంక్ష మిక్కుటమగుచున్నదే కాని మనోభీష్ట మీడేరుటలేదు. గడచిన సంవత్సరము నైరంజరా నదీ తీరాటవికి పశువుల మేతకై తోలుకొని వెళ్ళిన గోపబాలురు తీవ్ర తపోనిష్ఠయందున్న గౌతముని చూచి పల్లెకువచ్చి అడవి నడుమ మఱ్ఱిచెట్టు క్రింద శ్రీ మహావిష్ణువు తపస్సు చేయుచున్నాడని

చెప్పసాగిరి. క్రమముగా ఆ వార్త సుజాత చెవిని పడినది. ఆమె ఒక శుభ దినమున యింటిపనిచేయు రాధను వెంట బెట్టుకొని అడవికేగి తపోనిమగ్నుడైయున్న గౌతముని పాదములకు భక్తి తాత్పర్యములతో నమస్కరించి "స్వామీ! మీ కృపవలన నాకు పుత్రుడు కలిగెనేని పాయసము వండి తెచ్చి నివేదించుకొందును" అని హృదయ పూర్వకముగా విన్నపము చేసుకొని యింటికేగెను. గౌతము డామె రాకను, వినతిని, కని విని యెరుగడు.

సుజాత గౌతముని దర్శించిన కొలది దినములలో గర్భవతియై నవమాసములు నిండిన వెనుక చక్కని మగ బిడ్డను కనెను. ఆ పుణ్యదంపతుల ఆనందమున కవధులు లేవు. పుత్రోదయమునాటికి వారిమందలో నూరావులు పాలిచ్చు చుండెను. కొడుకు పుట్టిన మరునా డా నూరావుల పాలుతీసి తొంబది తొమ్మిది యావులకు పోసి త్రాగించిరి. ఆ రీతిని దినమున కొక్కొక ఆవువంతున తగ్గించుచు రాగా కడమ మిగిలిన కపిలగోవు చిరకాలము పాలనే త్రాగి మంచి బలిష్ఠ మైనదై ముద్దులు మూటగట్టు చుండెను. నూరవ నాటి వేకువ జామున సుజాత కపిలగోవు యిచ్చిన పాలతో పాయసము వండి బంగారు పాత్రతో నింపి స్వామి మొక్కు చెల్లించవచ్చెను.

సుజాత పాయసము తెచ్చి నమస్కరించి పాత్ర నంజలి ఘటించుటయు గౌతముడు సమాధి నుండి కనువిచ్చుటయు ఏకకాలమున జరిగెను. ప్రభువు కనులు తెరచి చూచి నంతనే సుజాత భక్తిసంభరితాంతరంగయై మరల ప్రణమిల్లి తన గాథ విన్నవించుకొనినది. గౌతము డామె పలుకులు విని ఆనందించి "అమ్మా! నీ కోరిక నెరవేరినట్లే! నా యభీష్టము తీరునట్లు దీవించుము" అనిపలికి సుచియై ఆ జాన పదాంగన ఒసంగిన పాయసము ప్రీతితో భుజించెను.

గౌతముడు నైరంజరానదీ తీరమున ఘోర తపము చేయు తెరింగి భద్రజితుడు, భాష్పుడు, అశ్వజితుడు, కౌండిన్యుడు. మహానాముడు అనబడు యేవురు బ్రాహ్మణముని పుంగవు లరుదెంచి గౌతముడు తస్సిద్ధివడసి ముక్తిమార్గము చూపగలడను నమ్మకముతో ఆ పరిసరమునందే పర్ణశాల నిర్మించుకొని నివసించి నిరీక్షించుచు కాలము గడిపిరి. ఇంతలో గౌతముడు తపోనిష్ఠవిడిచి సుజాత యొసగిన పాయసము స్వీకరించుట కండ్లార చూచినవారై "ఛీ! ఛీ! గౌతముడు భ్రష్ట ముని; పొట్టకూటివాడు; తిండిపోతు; నీతిహీనుడు జాతిభేద మెంచక పల్లెటూరి శూద్రపడతి యొసగిన పాయసము తినిన వాడు. ఏనిని నమ్మి యింతకాలము యిచ్చట వ్యర్థముగా గడిపి మోసపోతిమి" అని ఛీదరించుకొనుచు తక్షణమే యాచోటు విడచి వారణాసిపోవు మార్గమధ్యమందున్న మృగ

దావన మను మునిపల్లెను చేరుకొనిరి. అందున్న తాపసులు వీరి రాకను గురించి ప్రశ్నించ గౌతము యుదంతమెల్ల వివరించి ఆ భ్రష్టు డిటకు వచ్చునను మనలో కలియనీయరాదని చెప్పి మెప్పించి అందే నివసించుచుండిరి.

సుజాత యొసగిన పాయసము స్వీకరించిన పిదప గౌతముడు చిరకాల తపోనిలయమగు న్యగ్రోధవృక్షచ్ఛాయను విడచి నైరంజరాతీర మందలి అశ్వత్థ తరుమూలమున పద్మాసనాసీనుడై భవదుఃఖాంత పథము నరయు యోచనలో మునిగియుండెను.

అది యాతని యిరువది తొమ్మిదిరోజుల నిష్ఠ. ఆ నిష్ఠ యందాతని హృదయ నీరేజమున సదమల నిర్వాణ సదన ధామము గోచరమైనది. గౌతముడు బుద్ధుడైనాడు. నాడు వైశాఖపూర్ణిమ. షోడశకళాపరివృతుడైన హిమధాముడువిను వీధి విహరించవెడలు వేళ పండువెన్నెల పుక్కిటు బట్టినట్టి దివ్యతేజముతో బుద్ధదేవుడా అశ్వత్థవృక్షచ్ఛాయలో విరాజమానుడైనాడు. భువనశాంతికై విజ్ఞాన పుంజమెల్ల ముద్దయై వచ్చి లోకసమ్మోహనమగు చంద్రబింబాకృతిని భగవానుని శిరోజములవెనుక తేజశ్ఛత్రమైనది. రావిచెట్టుపైగల పక్షి సంతతియెల్ల కలకలారావములతో స్వామిశీర్షాగ్రమున ప్రదక్షిణ మొనర్చినవి. నైరంజరా ప్రవాహ మొక ఘడియసేపు నిలచి స్వామిని సేవించి తరించినది. వన మృగము లన్నియు సహజ వైరములను విడిచి గుమిగూడి వచ్చి బుద్ధదేవుని దర్శించిన తరించినవి.

మరుదిన ముదయ భానుని పసిడి వెలుగులు విశ్వ వ్యాప్తి నందుటయే తడవుగ బుద్ధుని పరీక్షించదలచి మద నుడు దండెత్తి వచ్చెను. తపోవనమంతయు మదన పరివా రముతో నిండిపోయినది. ఎందుచూచిననూ కామమోహా టోపముతే సుమసౌరభములు భ్రమరఝుంకారములు, కోయి లల కుహూకుహూ నినాదములు, అనురాగ రసరంజితవద నులైన మదనుని ప్రియపుత్రికల వీణా వేణుగాన నృత్య వినోదములే కాన వచ్చినవి. కాని మారుని యత్నముల న్నియు బూడెదలో పోసిన పన్నీరువలె నిరర్థకములేయైనవి. బుద్ధభగవానుడు నిశ్చలసమాధి నిమగ్నుడై బాహ్య జగత్తును దాటిపోయెను. తప్త కాంచనమును చేరిన మిడతలవలె మదన కుమారికామణులు భగ్గున మాడిపోయిరి. ఘోరావమాన భారముతో మారుడు తిరిగి పోయెను. మాయాదేవీ సుతు డాక్షణము నుండియు మారజిత్తయ్యెను.

ఆనందు డను రాకుమారుడు జ్ఞానపిపాసువు. అతడు గౌతము డీ వన భూములలో తపమొనరించు చున్నాడని విని వచ్చి ఆతని తపస్సిద్ధి నాకాంక్షించుచు ఆ సమీపముననే నివ సించు చుండెను. తీవ్ర దీక్షా తత్పరుడైన భగవానుడు నిర్వాణ మార్గమెరిగి మన్మథాటోపము నణగించి ప్రసన్ను యుండుట గమనించి పరుగు పరుగున ఊరుబిల్వమునకేగి

గోక్షీరములు కొనివచ్చి సమర్పించి బుద్ధదేవుని ప్రథమ కరుణా కటాక్ష వీక్షణమును బడసి ధన్యజీవియయ్యెను.

భగవానుడు తన దివ్య ధర్మబోధను తొలిసారిగా వారణాశిలో వెదచల్ల నిశ్చయించి ఆనందునితో బయలుదేరెను. ప్రభువు చనినంతమేర భూరుహములు పుష్పాక్షతలు రాల్చి పీవ దొరగినవి. పులులు మేకలట్లు తొలగి నిలచినవి. కరులు కరములెత్తి పూజించినవి. ఫణులు ఫణాగ్రమణుల కాంతులతో మార్గతిమిరము పోగొట్టెడివి. తీవ్రాతపముల పక్షులు తమ పక్షములు విప్పి నీడపట్టుచు ఎగసినవి. వేయేల? ప్రభువు చనినంత మేర ప్రకృతియే తరించినది.

బుద్ధదేవు డొకనాటి సంజ చీకటి వేళకు గృదావన మందలి మునిపల్లెకు చేరుకొనెను. గౌతముని రాక నెరిగిన మునిపల్లె నివాసులైన బ్రాహ్మణ పండితులు తమ నిర్ణయానుసారము పల్లె కొక ప్రక్కగా నున్న జీర్ణకుటీరమును చూపి "ఈరేయి యిందుండుడు; రేపు కలసి మాట్లాడుకొందమనిరి." బుద్ధు డానందునితో కలసి నిస్సంకోచముగా అందు వసించెను.

ఆ జీర్ణ కుటీరము ఎలుకల కాటుపట్టు. అందొక కోడె నాగు యథేచ్ఛగా నివసించుచుండెను. ఆ నాగు వలన భయముచేత మునిపల్లె వాను లా వైపునకు పోవుటయే లేదు. గౌతముడు భ్రష్ట ముని యనియు, త్రాచు వానిని కరచి చంపు

పనియు భావించి వారట్లు నియమించి తెల్లవారు సరికా గురు శిష్యులు మరణించి యుందురని భావించి అరుణోదయ మునకు ముందే వచ్చి చూడ భగవానుడు మందహాస వదనుడై నిర్వికారుడై నిమీలితలోచనుడై ధ్యాననిమగ్నుడై యుండెను. ఆ భయంకర వ్యాళము చేతాటి చుట్టవలె భగవానుని పార్శ్వ మున పవ్వళించి తనముం దిటు నటు పరువులెత్తు ఎలుకల నైన పట్టి తినక మూర్తీభవించిన శుద్ధ సత్త్వమువలె నుండుట చూచి స్మిత లజ్జావనతవదనులై తమ తమ దురూహలను విడచి భగవానుని పాదములపైబడి తమ అజ్ఞానమును క్షమించ ప్రార్థించిరి. భగవానుడు వారి నాదర దృష్టితో అవలోకించి ముందుకు సాగిపోయెను.

భగవానుడు ప్రథమముగా నవధర్మ ప్రవర్తన మొనరించినది వారణాశీ పట్టణమున. అమ్మహా నగరమున దిగ్దంతులవంటి పండితు లరువదిమంది యీ నవ ధర్మమును స్వీకరించిరి. అది మొదలీ నవధర్మ మార్గము క్షణ క్షణ ప్రవర్ధమానమై ఉత్తర భారతము నావహించినది.

బౌద్ధ ధర్మమునకు నాలుగు ప్రధాన సూత్రములు సునిశ్చలమైపరలుచుండును.అందు మొదటిది దుఃఖము. జన్మ దుఃఖమయము; జర దుఃఖమయము; రోగము దుఃఖమయము; కోరిన వస్తువును పొందలేక పొందిన వానిని కోల్పోయి దుఃఖపడుట కాంచుదుము. రెండవది తృష్ణ. ఇదియే దుఃఖ మునకు మూలము. మూడవది తృష్ణా నివారణ. నాలుగు

అష్టమార్గావలంబనము. ఇది ఎనిమిది విధములుగా నుండును. 1. పరిశుద్ధ సంకల్పము. 2. పరిశుద్ధానుభవములు. 3. పరిశుద్ధవర్తన. 4. పరిశుద్ధ వాక్కు. 5. పరిశుద్ధ జీవనము. 6. పరిశుద్ధ కృషి. 7. పరిశుద్ధాంతఃకరణ. 8. పరిశుద్ధాలోచన. ఇవియే అష్టమార్గములు. మరియు దానము, శీలము, అధిష్ఠానము, సత్యము, కరణ, నిష్కర్మ, ఉపేక్ష, క్షాంతి, వీర్యము, ప్రజ్ఞ, అనబడు పది పారమితలు కలవు. యీ పారమితలను పూర్తి చేయుటకై తా ననేక జన్మలెత్తినట్లు బుద్ధుడు శిష్యులకు తెలియజేయువాడు. అవియే జాతక కథలు. బౌద్ధ వాఙ్మయమున జాతక కథల కొక విశిష్ట స్థానము కలదు. అజంతా, ఎల్లోరా గుహాలయముల యందును నాగార్జున, అమరావతి, భట్టిప్రోలు, మున్నగు తావులందు కల బౌద్ధ స్తూపములపై బౌద్ధ శిల్పులనేక జాతక కథలు చిత్రించి సార్ధక జన్ములైరి.

## 9

మొట్టమొదట బౌద్ధ ధర్మము రాజాదరణ పొందినది మగధ రాజ్యమున. మగధ సార్వభౌముడగు బింబిసారుడు రాజగృహ పట్టణ సమీపమునందు తన కత్యంత ప్రీతి పాత్ర

మైన వేణువనమును భగవానునకు దానమిచ్చి తన దేశమున ధర్మవ్యాప్తి చేయుటకు పెక్కు అవకాశములు కల్పించుటయే కాక స్వయముగా బుద్ధదేవుని వలన ధర్మదీక్షను స్వీకరించి తరించెను. బింబిసారుని దేవేరియగు క్షేమ తథాగతుని శరణుపొంది నవధర్మము స్వీకరించెను.

బింబిసార నరేంద్రుడు బౌద్ధ ధర్మము స్వీకరించి నంతనే ఈ మతమునకు విశేష ప్రసిద్ధి, వ్యాప్తి లభించెను. ఇంటింటికిపోయి బిక్షాటనము చేయుచు లోక కళ్యాణమునకై జీవోన్నతికై పాటు పడు బుద్ధదేవుని పవిత్ర జీవన వైరాగ్య త్యాగ నిరతిని కని వివశులై తండోపతండములుగ వచ్చి జను లాతని నవధర్మమును స్వీకరించ దొడగిరి. బుద్ధుని నిరతి శయ త్యాగమయ జీవన సరళిని గురించి విని అజితుడను మునివరుడు శ్రీనగరమునుండి వచ్చి తథాగతుని వైరాగ్య జ్వాలను దర్శించి వివశుడై శరణుజొచ్చెను. ఆ కాలమున దేశ విఖ్యాతి వడసిన కుమార కాశ్యపుడు మౌద్గల్యాయనుడు, సారిపుత్రుడు మొదలగు మహామహులు, పీఠాధిపతులు, తత్వవేత్తలు మోక్షాతురులై వచ్చి సుగతుని దర్శించి నవ ధర్మము స్వీకరించి నలుదెసల దానిని వ్యాప్తి గావించ దొడగిరి. శ్రావస్తి నగర నివాసియు, మహా ధనికుడునగు అనాథ పిండదుడను వైశ్యోత్తముడు, బౌద్ధ ధర్మవ్యాప్తికై తన యశేష ధనరాసులు గ్రుమ్మరించెను.

కొంత కాలమునకు గౌతముడు రాజగృహము నుండి

కపిలవస్తు నగరమున కేగి యందు తనకై విలపించుచున్న భార్యా జనకులకు మనశ్శాంతి కలిగించి ధర్మదీక్ష యొసగెను.

బుద్ధుడు నిరుపమాన వచోనిధి. శ్రోతల హృదయముల నాటుకొను మృదుమధురోక్తులు యుక్తియుక్తముగ వివరించు నేర్పరి. వాద ప్రతివాదముల యందు అసమాన ప్రవీణుడు. దేహ మనిత్యము. పవిత్ర కర్మాచరణమే మోక్ష మార్గము. సకల దుఃఖములకు తృష్ణయే కారణము మొదలగు పవిత్ర ధర్మములాతడత్యంత నిపుణముగ సామాన్య మానవులకు కూడ బోధించి పవిత్రదీక్షని జీవింపచేయువాడు.

శాలియా గ్రామ పరిసరారణ్య నివాసియు నరహంతకుడు నగు అంగుళీమాలు డను చోరు డీ మహామహుని నిర్మల వాక్కులు వినినంతనే తన క్రూరప్రవృత్తికి, నీచజీవనమునకూ స్వస్తి చెప్పి బౌద్ధ భిక్షువయ్యెను. వింధ్యాటవీ ప్రాంతమున ఒక బోయవాడు పన్నిన వలలో చిక్కుకొనిన లేడిని విడిచి పెట్టినందుకు బుద్ధుని చంపెదనని వచ్చిన బోయవాడు నిశ్చల సమాధి నిమగ్నుడైన ఆ తేజోమూర్తిని చూచి పాదాక్రాంతుడై శిష్యుడయ్యెను.

గౌతము డొకనాడు కపిలవస్తు నగరము నుండి రాజగృహమునకేగుచు మార్గమధ్యమున భరద్వాజుడను కృషీవలుని యింట విశ్రమించెను. ఆతిథ్యానంతరము రైతు "స్వామీ! మీ రన్నియు విడచి భిక్షాటన చేయుచు యాతనలు

పడెదరేల? నావలె వ్యవసాయము చేసుకొనరాదా! సుఖ జీవనము చేయవచ్చు"ననెను. బుద్ధు డాతని మాటలకు నవ్వు కొని "నాయనా! నేనును సేద్యమే చేయుచున్నాను. నాకే మియు లోటులేదు" అనినంతనే నీ పొల మే దిశ నున్నది? ఎద్దులెన్ని? నాగలి ఎట్టిది?" అని భరద్వాజుడడిగెను. "నేను "ధర్మశాస్త్రి"మను పొలము దున్నుదును. ధర్మమే నాగలి: నిరంతర ప్రయత్నమే నా దుక్కుటెద్దులు; సత్యమే ముల్లు కట్టు; సత్కర్మాచరణయే వర్షమై నా చేను తడుపును. మోహ మద మాత్సర్యములే అందలి కలుపు మొక్కలు. ఇవి మొలచిన వెంటనే తీసి వేయుదును. నా యీ వ్యవసాయ మున ఫలించు సత్యమే నిర్వాణము" అనగా విని ఆ రైతు జ్ఞానవంతుడయ్యెను. ఇట్లసంఖ్యాకములైన నీతి బోధలతో వర్ణవర్గరహితమైన శాంతి సత్యహింసా ప్రేమ సిద్ధాంతము లను నిరంతరము బోధించువాడు.

అత్యంత భూతదయాళుడు, నవ్యనవనీత సదృశ హృదయుడు, పరమ కారుణ్యమూర్తియునగు బుద్ధ భగవా నుడు నలుబదియైదు దీర్ఘవత్సరము లీ నవధర్మమును బోధిం చుటకై వెచ్చించెను. ఆయన చనినంత మేర సత్యాహిం సలు శాంతి సుధాస్రవంతులై ప్రవహించినవి. ప్రతి వత్స రము వర్షాకాలమున ఏదోయొక విహారమున స్థిరనివాసము చేయుచు మిగిలిన కాలమంతయు ధర్మ బోధకై సంచారము చేయుట పరిపాటిగా సాగి పోయెడిది.

భగవానుడు భౌతిక జీవితమందలి చివరి రోజులలో పాలోయ యను గ్రామమునందు చందుడను కమ్మరి భక్తుని యింట విందు గుడిచెను. అదియే ఆయన తుది భోజనము. మరుదినమే ఆయన గ్రహణి రోగగ్రస్తు డయ్యెను. ఆ వ్యాధితోనే భగవానుడు కుశి నగరము చేరెను. వ్యాధి తిరుగు ముఖము పట్టలేదు. ఒకనాటి వేకువజామున ఆనందాది శిష్య సంఘము తన చుట్టును చేరి పరితపించు చుండ వారికి తన చరమ సందేశ మొసగి మహా పరి నిర్వాణము పొందెను.

భగవానుడు నిర్వాణము పొందు సమయమున తరు లతాదు లాకస్మికముగ పుష్పించినవి. ఆనంతాకాశము నుండి మృదుమధుర గానములు వినవచ్చినవి. ఆ మహా తరుణమున భగవానుడు తన వదన మానందుని వైపు త్రిప్పి "ఆనందా! తథాగతుని సన్మానించుట యిట్లు కాదు; విశ్వ మంతట భిక్షుక భిక్షుకీ సంఘములు ధర్మమార్గమున వర్ధిల్లుచు, సంచరించుచు, పవిత్రజీవనముతో తమ తమ ధర్మములు నిర్వహించుచుండుటకన్న తథాగతున కానందదాయకమగు మహత్తర కార్యములేదు" అని మృదుమధుర వాక్సుధా ధారలతో కడసారి శిష్యకోటిని దనియించి పునరావృత్తి రహితమైన పరమధామమున కేగెను. బుద్ధ భగవానుడు జీవించి యున్నప్పుడు జీవితాంతమందును యీ దివ్య సందేశామృతమును వర్షించుచు గడపెను. ఆహా!! ఆతని భూతదయ, పరోపకార పారీణత, లోక కళ్యాణాకాంక్ష

విశ్వజనీనములు. అనంత ప్రశంసా పాత్రములు, సర్వదా సర్వులకు శిరోధార్యములు.

ఆనందాది శిష్యవర్గము భగవానుని భౌతిక దేహమును పుష్పమాలికలతో అలంకరించి బంగారు పల్లకీయందుంచి తీసుకొనిపోయి హిరణ్యవతీ నది కావలనున్న బుద్ధుల దహన సంస్కారములకై యేర్పరుపబడిన చైత్యమున సుగంధ కాష్ఠముతో చితి సమర్చి అందా పవిత్ర కళేబరము నుంచి దహన సంస్కారము నొనర్చిరి. దగ్ధ శేషితము లగు శల్యములను శిష్యులు దేశ దేశములకు గొనిపోయి వానిపై రమణీయ స్తూపములు నిర్మింపజేసి ఆరాధించుచు వచ్చిరి. అట్టివాని శిధిలములు నేటికిని భారతావని యందేకాక ఆంధ్ర రాష్ట్రము నందును కలవు.

## * అనాథ

సుగతుడు నిరుపమాన బోధనాపటిమ కలవాడు. ఎంతటి పామరులనైనను తన సునిశిత బోధనా పటిమచే పరిణత చిత్తులను చేయగలిగెడువాడు.

తథాగతుడు రత్నగిరి గుహలో తపము చేయు కాలమున ఆ ప్రాంతమునందుగల పల్లెయందొక యనాథ నివసించుచుండెడిది. ఆమెకు పది పన్నెండేడుల యీడుకల

కుమారు డుండెడివాడు. ఆ పేదరాలు విగత భర్తృకయైన ప్పటి నుండియు కలవారి యిండ్లలో పనులు చేసి వారొసగు స్వల్ప వేతనముతో గుట్టుగా జీవించుచు తన యేకైక సుతుని పోషించుకొనుచు జీవయాత్ర సాగించు చున్నది. ఒక దినమం దా కుఱ్ఱవాడు తన యీడు బాలురతో ఆట లాడు సమయమున పెంటకుప్పలలో మూషికములకై పొంచి యున్న కాల సర్పము తోకపై వాని పాదము పడినది. కను రెప్పపాటులో ఆ పద తాడిత కాలభుజంగము కస్సున లేచి అనాథ బాలుని కాలు కరచెను. కుఱ్ఱవాడు భయ భ్రాంతుడై కెవ్వుమని యరచినాడు. యితర బాలకు లది చూచి భయముతో పారిపోయిరి. నలుగురు పెద్దలు మూగు సరికి పాము కనుమరుగై పోయినది. కొలది నిముషముల లోనే పేద బాలుడు స్పృహ కోల్పోయెను. ఆ వార్త వినిన తల్లి గుండెలు బాదుకొనుచు వచ్చి తనయుని భుజముపై వైచుకొని గోడు గోడున యేడ్చుచు విషవైద్యుని యిల్లు చేరెను. వైద్యుడు మంత్రించి మందులు పోసి తన యావ చ్ఛక్తిని ధార పోసినను లాభము లేక పోయినది. ఆ బాలుడు శాశ్వతముగా యీ లోకమును విడచి పోయినాడు. అనాథ దుఃఖమున కంతము లేదయ్యెను. అప్పు డొక పెద్ద ముందుకు వచ్చి "అమ్మా! యిట్లెంత యేడ్చినను ప్రయోజ నములేదు. నీ బిడ్డ బ్రతుకుట కొకేవొక మార్గము కనిపించు చున్నది. రత్నగిరి గుహనుండు రాజయోగి కడకు నీ

కుమారుని కొనిపోయి వేడుకొనుము. ఆ మహాత్ముడు దయ దలచెనేని నీ తనయుని బ్రతికించ గలడు ఆలసింపకు” మని హెచ్చరించెను.

అనాథ వీనుల కాతని హితోక్తు లమృత సేచనమైనవి. తన కొడుకు బ్రతుకునన్న పేరాస యంకురించినది. నిరాల స్యముగా మృతసుతుని కళేబరమును భుజమున వైచుకొని శ్రమ లెక్క చేయక చని పర్వత గుహాలయమున నివసించు గౌతముని దర్శించి సాష్టాంగ ప్రణామ మాచరించి కుమారుని బ్రతికించ వేడుకొనెను.

గౌతము డా యనాథ దయనీయ చరిత మాలించి “తల్లీ! విచారించకు. నీ కుమారు నటు పరుండబెట్టు. పల్లెకుపోయి పిడికెడు ఆవాలు తెమ్ము. కాని అందొక నియమము మాత్రము మరవవద్దు. నీ వర్థించి తెచ్చు ఆవాలు ఎన్న డును మృతశోక మెరుగని యింటివై యుండవలెను. అట్లు కాని యెడల నీ కొడుకున కాయువు నొసంగ గల పని చేయలేవు. అని చెప్పినంతనే యా దీనురాలు కొండంత యా శతో పల్లెకుపోయి యావాల నర్థించుచు యిల్లిల్లు తిరిగినది. ఏ యింటి కేగినను ఆవాలు పెట్టుట కభ్యంతరములేదు కాని చావుగోడు నెరుంగని యిల్లాలి యిల్లు కానరాలేదు. ఏ గృహిణి నడిగినను మా తోబుట్టువు పోయి ఏడాది కాలేదు. నిరుడే చెట్టంత కొడుకు మట్టిపాలు చేసుకొనినాము.

కొండంత ఋణము చేసి మామమగారి మధ్యనే మరణించి నారు. అని తమ తమ కుటుంబములకు వాటిల్లిన మృత జన శోక వార్త వెల్లడించు వారేగాని మరణరోదన మెరుగని వారులేరు. అటువంటి వారిచ్చిన యావాలు పని చేయవని గౌతముడు చెప్పియుండెను.

ప్రొద్దు పడమరకు పోయినది. కాళ్లరుగున ట్లూరెల్ల తిరిగిన అనాథ హతాశయై గౌతముని కడకువచ్చి మ్రొక్కి తాను కని వినినవెల్ల బరువు గుండెతో నివేదించుకొనినది. అపుడు గౌతముడా పేదరాలిని సానునయోక్తులతో నిట్లూరడించెను.

"అమ్మా! యీ సృష్టిలో పుట్టిన ప్రతి వానికిని మరణము తప్పదు. ఇది సకల జనులు నిత్యము చూచుచున్న విషయమే యైనను మమత్వముతో మరణించిన బంధుమిత్రులకై విలపింతురేకాని; యిట్టి దుర్దశకు గురికాకుండు తరుణోపాయమునకై యత్నించరు. లోకమందు నీ వలెనే మృత శోకానలమున మ్రగ్గు వారి నర్థము చేసుకొనుటకై నిన్ను నియోగించితినే కాని మరణించిన యే ప్రాణి దేహము నందును ప్రాణము పోయ గలవారు లేరు. నేనీ జనన మరణ క్లేశముల కతీతమై నిర్వాణ మార్గాన్వేషణముతో యీ విధముగ నీ కొండపై తపమొనరించుచున్నానే కాని అన్యమేమియు కాదు" అని తేట తెల్లముగా పలికినంతనే

ఆ యనాథ ఖేదమోదావృతములైన ప్రాణి లోక మర్యాద లర్థము కాగా గుండె రాయి చేసుకొని కుమారుని మృత దేహమున కగ్ని సంస్కారము లొనర్పుటకై తీసుకొని పోయినది.

బుద్ధ భగవాను డట్టి యుక్తి యుక్తమగు సూక్తులతో పామరులకు సైతము పవిత్ర సందేశము నందించి కర్తవ్య పథమున నిలుపు చుండెడివాడు.

## ఆనందుడు

బౌద్ధ ధర్మము జడికట్టి వర్షించుచున్న రోజులవి. మగధ, కాశీ, కోసల, అవంతి. రాజ్యముల యందలి ప్రజలు బుద్ధ బోధామృతమును గ్రోలి తరించిరి. ఆ కాలమున ఇంద్రప్రస్థము నేలు రాష్ట్రపాలుడు మహా పండితుడు. ఆయన బుద్ధదేవుని అచంచల త్యాగ వైరాగ్యములు, జ్ఞాన దీప్తిని గురించి విని వచ్చి దర్శించికోరి తన రాజధానికి తీసుకొనిపోయెను. విద్వత్ప్రభువగు రాష్ట్రపాలుడేకాక విమల విజ్ఞానవతియగు ఆని సోదరి మహా కోసలాదేవియు బౌద్ధ ధర్మమును స్వీకరించి తన్మత ప్రచారమునకై విశేష కృషి సలుపుచుండ మారజిత్తు కొంతకాల మందు నివసించెను.

తథాగతుడు ఇంద్రప్రస్థమున నున్న కాలమున బింబిసారుని తనయు డజాత శత్రువు బుద్ధదేవుని పినతండ్రి

కుమారుడగు దేవదత్తుని దుర్బోధకు చెవియొగ్గి తండ్రిని వధించి సింహాసన మధిష్ఠించెను. మానసీయుడైన తండ్రిని చంపి గద్దెనెక్కిన యాతని మహదానందము ఉదయభానుని కిరణ స్పర్శచే నశించిపోవు మంచువలె మటుమాయమై అనంత హృదయ వేదనకు దారి తీసినది. తా నొనరించిన క్రూరకృత్యము మూర్తీభవించి అగ్నికీలవలె హృదయ కుహరమును వ్రయ్యలు చేయ దొడగినది. తన క్రూర ప్రవృత్తి అంతరచితనామయమైన కొలది నిద్రాహారములు లేక రేయింబవళ్లు పరితపించినను చిత్త శాంతి లంభించ దాయెను. విశ్వవిఖ్యాత భిషగ్వరుడైన జీవకుడు అనేక విధముల యత్నించియు రాజునకు స్వస్థత కలిగించలేక "రాజా! నీ మనోవీధిని రగిలి పొగలు చిమ్ము నీ మహాపాపాగ్ని కీలల చల్లార్ప బుద్ధ భగవానుడొక్కడే తగిన వైద్యుడు. నిన్నుద్ధరించ నా తథాగతుడొక్కడే సమర్థుడు కాని; యితరులు అనర్హులు. నీవా కరుణామయుని శరణు వేడుము. చిత్తశాంతి చేకూరగలదని" హితవు చెప్పెను.

బుద్ధ భగవానుడు బింబిసారుని దుర్మరణ వార్త నాలించి విచారించి, ఆనందాది శిష్య సమేతముగా మగధకు వచ్చి రాజ గృహమందలి వేణువన మందు విడిది చేసెను. జీవక ప్రబోధితుడైన అజాత శత్రువు బుద్ధదేవుని రాక నెరిగి దీనాతిదీనుడై చని తథాగతునకు ప్రణమిల్లెను. సుగతు డాతని మనః పరివర్తనమును గమనించి" వత్సా!

క్రూర సంసర్గము వలన కొఱగాని పని కొడిగట్టి దాని ఫలితము చవి చూచితివి. ఏ మానవుడు తానొనరించిన ఘోర కర్మలను గుర్తించి పశ్చాత్తాప భరిత చిత్తుడై భావి జీవితము నం దట్టి చెడుత్రోవల జనడో ఆ మానవుడు పాప కూపము నుండి వెలువడి పవిత్రుడగుట కెట్టి సందేహము లేదు. కనుక నీ గత మలిన చిత్తమును పశ్చాత్తాప జలముతో కడిగి సర్వదా పవిత్రుడవు కమ్ము" అని దీవించి యూరడించగా పులుగడిగిన ముత్తియంపు హొలుపున హృదయ శాంతితో ప్రజారంజకముగా పరిపాలించెను.

కాలము గడచుచున్నది. ఒక పర్వదినమున అజాతశత్రువు శిష్య సమేతముగా బుద్ధదేవుని తన యింట విందారగింప నాహ్వానించెను. శాక్య సింహుడా తని యాకాంక్షను మన్నించి నిర్ణీత దినమున మధ్యాహ్నవేళ శిష్య సంయుతుడై వేణువనము నుండి రాజ మందిరమునకు వచ్చుచుండెను. దుర్వర్తనుడైన దేవదత్తుడు ఎట్లయినను శిష్య సంయుతముగా బుద్ధుని కడతేర్చవలెనను దురాలోచనతో రహస్యముగా గజశాలను తెరిపించి అయిదు వందల యేనుగులను రాజ నగరి కరుగు శాక్యముని పై తోలించెను. ఆ మదపు టేనుగులు ఘీంకారములు చేయుచు బిక్షకు వచ్చుచున్న బౌద్ధ భిక్షువుల పైకి తొండము లెత్తి శరవేగమున రాజొచ్చినవి. కాళ్లు మొలచి కదలి వచ్చుచున్న కొండ గుట్టలవలె నున్న మదపు టేనుగులను చూచి భిక్షువులందరు ప్రాణ

భీతిచే పరుగిడి తల దాచుకొనిరి. ధ్యానాయత్త చిత్తుడై వచ్చు బుద్ధ దేవుడు భిక్షువుల యార్త నాదములు గజయూథ విజృంభణము చూచి నిర్భయుడై మార్గమధ్యమున దక్షిణ హస్త మెత్తి నిలచెను. పైకెత్తి బడిన భగవానుని చేతి వ్రేళ్ళు యిదును ఐదు సింహముల వలె ప్రత్యక్షము కాగా ఆ మదపు టేనుగులు భయపడి వెనుతిరిగి తమ తమ పాలకులనే త్రొక్కి చంపుచు పిక్క బలము చూపినవి. ఆనందుడు మాత్రము యితర భిక్షువుల వలె భీతిల్లి పారక బుద్ధదేవుని అంగరక్షకుని వలె వెన్నంటి నిలచియుండెను. తన దుశ్చేష్టలన్నియు యేటిపై చల్లిన సీటివలె కాగా తీవ్ర లజ్జావమానములతో దేవదత్తుడు నిర్జన మార్గమున పారిపోయెను.

ప్రాణముల మీది తీపిచే ఆపత్సమయమున స్వామిని విడచి పారిపోయిన భిక్షువులు తిరిగి చేరిరి. ఇంతలో రాజ నగరాంతః పురమందున్న అజాత శత్రువున కీ దుర్వార్త తెలిసి పాదచారియై పరుగు పరుగున వచ్చి వేణువన విహారమునకు తిరిగి పోవుచున్న సర్వజ్ఞుని పాదములపై బడి తనకు తెలియని రీతిని దేవదత్తుడు చేసిన ఘోరకృత్యమును క్షమించి వచ్చి భిక్ష స్వీకరించ వేడుకొని నిజమందిరమునకు తోడ్కొని పోయెను.

బుద్ధదేవు డజాత శత్రువొసంగిన విందు శిష్య సమేతముగా స్వీకరించి విశ్రమించి యున్న సమయమున అందరు వినున ట్లీ వింత కథ వినిపించెను.

"పూర్వకాలమున ఒక రాజుండెడివాడు. ఆ రాజున్కు నకు అడవి పక్షుల మాంసమనిన ప్రీతి. అందుకై ఒక విలు కానిని యావజ్జీవనో పాధికనువగు మాన్య మిచ్చి పోషించెడి వాడు. ఆ వేటగానికి రాజునకు ప్రీతికరమైన పక్షులను వధించి తెచ్చియిచ్చుటయే దినచర్య. చాలాకాల మట్లే గడచి పోయెను. ఒకనాడా వేటగాడు అడవిలో మచ్చునకై కొన్ని గింజలు చల్లి దాపుననే కల పొదలో దాగియుండెను. విను వీధి నేగుచున్న పక్షుల గుంపొకటి ఆ కిరాతుడు చల్లిన గింజల నరసి వానిని తిని కడుపుచిచ్చు చల్లార్చుకొను ఆశతో భూమికి దిగినవి. మందకు ముందున్న పక్షిరాజు ముందుగాచని మేత తినబోయి వలలో చిక్కుకొని కొట్టుకొన సాగినది. తమ రాజు దురవస్థ నెరిగియు ప్రాణముల మీది తీపి చేత పక్షు లన్నియు పారిపోయినవి. ప్రభు భక్తి పరాయణయగు ఒక పక్షి మాత్రము వేటగాడు రువ్వెడి రాళ్ళ నెట్లో తప్పించు కొనుచు ప్రాణ రక్షణకై పారిపోవక యజమాని రక్షణకై బిగ్గరగా కూయుచు నందే యున్నది. స్వామి భక్తి పరాయణ యైన ఆ పక్షి దీనారావము లాలించి వేటగాని మానసము

ద్రవించి చంప మనసొప్పక వలలో చిక్కిన పక్షిరాజును కూడ విడిచిపెట్టి వెడలిపోయెను. ఆ పక్షి మాంసాభిలాషి యగు రాజచంద్రుడే ఈ అజాత శత్రువు. కిరాతుడే దేవదత్తుడు. వలలో చిక్కిన పక్షిరాజునే నేను. ప్రాణ భయము వదలి అందే యుండిన పక్షి యీ ఆనందుడు. దేహాభిమానముతో పారిపోయిన పక్షుల గుంపే యీ భిక్షుక గణము" అని కథ ముగించ అజాత శత్రువు లజ్జావనత వదనుడై మ్రొక్కి శేష జీవితమును సంస్కరించు కొనెను. భిక్షుక కోటి తమ దేహాభిమానములకు సిగ్గుపడి జీవితముల సరిదిద్దికొనిరి. అచంచల స్వామి భక్తి పరాయణుడైన ఆనందుడు బుద్ధ భగవానునిని అనంతరము అభినవ బుద్ధుడై ధర్మ వ్యాప్తికి జీవిత శేషమును ధారపోసి ధన్యజీవి యయ్యెను.

# ప్రేమ బలము

"ఈ ప్రపంచమునం దెన్నడును పగ వలనపగ నశించ నేరదు. ప్రేమ వలన పగ నశించి శ్రేయము కలిగించును" అని శిష్యకోటి కీ కథ బుద్ధ భగవానుడు చెప్పు చుండెడి వాడు.

బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యమున కధిపతి. అతని దేశము విశాలమైనది. అపార సైనిక బలము కలదు. బల వంతులైన రాజులు బలహీన రాజ్యములను కొల్లగొట్టి చేచిక్కించుకొనుట పరిపాటి. అందువలన అతని హృద యము పర రాజ్యాక్రమణకై ప్రాకులాడెడిది. కొంత కాల మునకు బ్రహ్మదత్తుని దృష్టి కోసల దేశముపై పడినది. కోసల నా కాలము దీఘితియను రాజేలు చుండెను. ఆ రాజుకు బ్రహ్మదత్తున కున్నంత సైనిక సంపద లేదు. అందువలన కాశీరాజు చేయు దురాక్రమణ మరికట్టలేక కొలది దినములు మాత్రము పోరాడి శత్రువులకు చేజిక్కి పోయేను. దీఘితిని రిపు సైన్యము బంధించి రాజ్యమును

వశపరచు కొనినది. బ్రహ్మదత్తుడు దయా విహీనుడై దీధి తిని ఉరితీయించి చంపెను.

కోసలాధిపతియైన దీధితికి పది పన్నెండేడుల యీడు గల కుమారుడు కలడు. అతని పేరు దీర్ఘాయువు. మరణ సమయమునకు ముందు దీధితి కుమారుని చేరపిలిచి "కుమారా! లోక మందెప్పుడు పగచేత పగ నశించదు. ప్రేమ వలననే పగ నశించును ప్రారబ్ధ వశమున నేడునే నీ విధముగా మరణించు చుంటిని. నాయనా వాపోపక యిజు వర్తనుడవై పగవానిని సైతము ప్రేమించుచు నేర్చుకొని శాంతితో వర్తిల్లుము" అని యశ్రుమిశితలోచనుడై గద్గద భిన్న కంఠముతో పలికి ఉరికంబమున శాశ్వతముగా కన్ను మూసెను.

బాలుడైన దీర్ఘాయువు ఎట్లో శత్రువుల కనుగప్పి తప్పించుకొని ఘోరాటవులకు పారిపోయెను. దుర్మరణము నకు గురియైన తండ్రికై విలపించుచు ఆ వన భూముల యందు గుట్టుగా జీవించు చుండెను. వయస్సు పెరిగిన కొలది అతని మానసమున పితృ హంతకుడైన బ్రహ్మదత్తునిపై పగ సాధించవలెనను ప్రతీకార వాంఛ పెరిగిపోవు చుండెను. సహజ సుందరుడై యారాచ బిడ్డ మోమున క్షాత్ర తేజ ముట్టి పడ జొచ్చెను. కొంత కాలమున కతడా అరణ్య వాసమును

విడచి బ్రహ్మదత్తుని రాజధానీ నగరముచేరి నేర్పుతో వారి అశ్విక దళమున చిన్న ఉద్యోగము సంపాదించెను. ధీరుడు, కుశాగ్ర బుద్ధినగు రాచ బిడ్డ యగుటవలన అచిర కాలము లోనే ఉన్నతోద్యోగుల మన్ననలు పొంది అశ్వ శాలాధిపతి అయ్యెను —

దిఘాయు ప్రొకనాటి మలిసంజలో గుఱ్ఱాల శాల కెదురుగా నున్న విశ్రాంతి వేదికపై కూర్చుండి నేర్పు మెఱయ పిల్లనగ్రోవి నూదుచు శ్రావ్య గానము సలిపెను. ఱాళ్ళను సైతము కరిగించ జాలు అతని వేణునాదము శ్రోతల మానసముల నలరించుచు పైరగాలిలో కలిసి ప్రవ హించి పోయినది. నిజ సౌధోపరితలమున చల్లగాలిలో విశ్ర మించి యున్న బ్రహ్మదత్తున కా వేణుగానము వీనులకు విందు చేయగా సేవకులను పంపి ఆ పిల్లనగ్రోవి పాటగానిని తన కడకు రప్పించుకొని వాని రూప లావణ్యములకు ముచ్చట పడి సర్వ సైన్యాధ్యక్షుని ద్వారా అతని గుణశీలములు విని ఆనందించి తన ప్రధాన అంగరక్షకునిగా నియమించు కొనెను.

దినములు గడచు కొలది బ్రహ్మదత్తుని అనురాగ లతికలు సాగి దిఘాయువును పెనవైచి నరపతికి అత్యంత ఆత్మీయునిగా చేయగడగినది! దిఘాయువు మానసము బ్రహ్మదత్తుని వధించి పితృఋణము తీర్చుకొనుటకై తగిన సమయ మెప్పుడా యని ఆరాట పడసాగినది.

భూపతులు మృగయా వినోద పరులు. అందు బ్రహ్మదత్తు డగ్రగామి. అత డొకనాడు సైన్యయుతుడై వేటకు బయలుదేరెను. దిఘాయువు బ్రహ్మదత్తుని రథసారథియై మెలకువతో రథము నడుప దొడగెను. చిరకాలము నుండి పగ సాధించుకొను అదనుకై వేచియున్న దిఘాయువు వేట తమిలో నున్న రాజు రథము సైనికులేగిన దారి తప్పించి సుదూర ఘోరారణ్యములోనికి తోలుకొని పోయెను. మిట్ట మధ్యాహ్నమునకు అలసిపోయిన బ్రహ్మదత్తుడు నట్టడవిలో గల పెద్ద వట వృక్షము సమీపించినంతనే దాని నీడలో మేను వాల్చి విశ్రమించ గోరెను. తేనియానతి మేరకు దిఘాయువు రథమాపి గుఱ్ఱములను బంధించి నరపతి విశ్రాంతికై చక్కని ప్రక్క నమర్చెను. రాజా చల్లని నీడలో సారథి తొడపై తల నిడి మైమరచి నిద్రించెను.

కొలది ఘడియల కాలము గడచినది. రాజు గాఢ నిద్రయందుండెను. ఎటు చూచిననూ కొన్ని యోజనముల వరకు నరసంచారము లేదు. చిరకాలము నుండి లోలోపల రగులు కొనుచున్న ప్రతీకారవాంఛ దిఘాయువు హృదంతరము నుండి పెల్లుబికినది. మరుక్షణముననే పితృహంతకుడైన నృపుని శిరస్సు ఖండించవలచి మొలనున్న క్రొవ్వాడి ఛురిక తీసి పైకెత్తెను. కనురెప్ప పాటులో బ్రహ్మదత్తునకీ లోకము తోడి బంధము తీరిపోవుట కెంత మాత్రము

సందేహములేదు. కాని త్రుటిలో దిఘాయుపు మనస్సు మారిపోయెను. అతని స్మృతి పథమున మరణవేళ పితృ దేవుడు "కుమారా! పగ వలన పగ నశించదు. ప్రేమ బలము వల్లనే పగ అంతరించిపోవును" అని చెప్పిన పవిత్రోక్తి మెఱుపువలె మెరసినది. మరుక్షణముననే యాతనికి తన తలంపు చాల నీచమైనదిగా తోచి మేను వణక చేతనున్న కత్తి నేలపై బడెను ఆ సవ్వడికి బ్రహ్మదత్తుడు మేల్కొని దిఘాయువును చూచి నివ్వెర పోవుచుండగా యతడు "రాజా! నేను నీచే ఉరితీయుంచబడిన కోసలరాజు దిఘితి కుమారుడను. నా తండ్రి మరణానంతరము మీ కనుగప్పి అడవులకు పారి పోయి పెరిగి పెద్దవాడనై పగతీర్చుకొనుటకై తిరిగివచ్చి మీ కొలువులోచేరి మీ మన్ననలు పొంది అంగరక్షకుడనై నమ్మ కముగా మెలగుచు నేడు నా పగ సాధించుకొనుట కనువగు దినముగా నిర్ణయించుకొని అలసటచే మైమరచి నిద్రించు చున్న మీ తల తరుగబోవు నంతలో మరణించువేళ నా తండ్రి" కుమారా! పగవలన పగ నశించదు. ప్రేమవలననే పగ నశించును "అనిన అమరోక్తి స్ఫురణకు రాగా కత్తి జార విడిచితిని" అనెను.

బ్రహ్మదత్తుడు సంభ్రమాశ్చర్య పులకిత గాత్రుడై దిఘాయువును కౌగలించుకొని "నాయనా! నేను మహా

పాపిని. నరరూప రాక్షసుడను. కలిగిన దానితో తృప్తిపడక కలనైన నాకు ఎగ్గు తలుపని నీ తండ్రి రాజ్యమాక్రమించి సర్వనాశనము చేయించిన నన్ను సమయము లభించి చంప బోవువేళ నా వలన ధర్మగుణము పొందిన నీ జనకుని అమర వాక్కులే నన్ను ప్రతిఘటించినవి. నేను చేయించిన దురాగతముల కంతములేదు" అని వాపోయెను. గతించిన దానికి చింతించిన ఫలమేమని దిఘాయువు పలికి యూరడిల్లి రాజధానికివచ్చి మహావైభవముతో దిఘాయువునకు తన కుమార్తె నిచ్చి పెండ్లి చేసి అతని పితృవ్యమగు కోసల రాజ్యమునే కాక తన రాజ్యము గూడ సమర్పించి ఆదరించి శాంతి పొందెను.

ఈ తెరగున అనేక దివ్యాను భూతులతో కూడిన సార సుధా మధురోక్తులతో బుద్ధ భగవానుడు తన శిష్యులను తనియజేయువాడు. ఆచరణ శీలురైన బుద్ధదేవాంతేవాసులు ఆనాడు, ఈనాడు ఏనాడును ధన్యాతిధన్యులుకదా?

బుద్ధం శరణం గచ్ఛామి

ధర్మం శరణం గచ్ఛామి

సంఘం శరణం గచ్ఛామి.

(బౌద్ధ మతము గూర్చి వివేకానందుని

ఉపన్యాసము ప్రక్క పేజీలో)

# హిందూమత సాఫల్యమే బౌద్ధమతము

(1893 వ సం॥ సెప్టెంబరు 26 వ తేది)

నేను మీరు వినినట్లుగా బౌద్ధుడను కాకున్నను బౌద్ధుడనే. చైనా, జపాన్, సిలోన్ దేశాలు మహాప్రభుని బోధలు అనుసరించుచున్నవో, భారతదేశము ఆయనను సాక్షాత్తు అవతారమూర్తిగా పూజిస్తుంది. నేను బౌద్ధమతాన్ని ఖండించబోతున్నానని మీరిప్పుడు విన్నారు. కాని దాని వలన మిమ్ము నేను గ్రహింపకోరేది ఇది. సాక్షాదవతారమూర్తి యని నేను పూజించు ఆ మహనీయుని భావాలను ఖండించడమా! బుద్ధదేవుని శిష్యులు ఆయన తత్త్వాన్ని సరిగా అవగాహన చేసికొనలేకపోయారని నా అభిప్రాయము. యూదుమతానికి (జుడాయిసమ్), క్రైస్తవ మతానికి ఎలాంటి సంబంధముందో, హిందూమతానికి (హిందూమత మనగా—వైదిక ధర్మమని, సనాతన ధర్మమని నా అభిప్రాయము), బౌద్ధమతానికి ఇప్పుడు అటువంటి సంబంధమే ఉంది. ఏసుక్రీస్తు యూదుడు. శాక్యముని హిందువు. యూదులు ఏసుక్రీస్తును త్రోసిపుచ్చారు-కాదు, సిలువ వేశారు; కాని హిందువులు శాక్యమునిని దైవముగా నమ్మి పూజించుచున్నారు. ఆధునిక బౌద్ధమతానికీ, బుద్ధదేవుని బోధలుగా మనము గ్రహించవలసిన తత్త్వాలకూ నిజమైన భేదము హిందువులుగా మేము ముఖ్యముగా చూపెట్టబోయేది ఇది: శాక్యముని నూతనతత్త్వాన్ని ఏమీ బోధింపరాలేదు. అతడును ఏసువలె (మత ధర్మాలను) సఫలం చేయటానికేగాని నశింప చేయడానికి రాలేదు. కాని వ్యత్యాసమిది:

ఏసు విషయంలో, ఆయన బోధలను గ్రహింపలేకపోయినవారు

ప్రాచీనులగు యూదులు: బుద్ధుని విషయంలో, ఆయన తత్త్వార్థాన్ని గ్రహింపలేకపోయినవారు స్వయముగా ఆయన నియమాసుసారులే. ప్రాత నిబంధన (ఓల్డు టెస్టమెంటు) సాఫల్యాన్ని యూదులు గ్రహింపనట్లే, హిందూతత్త్వపు సాఫల్యాన్ని బౌద్ధులు గ్రహింపలేదు. శాక్యముని ఏ మత ధర్మాలనూ నాశనం చేయుటకు జన్మించలేదని హిందూమత తత్త్వాలకు సహేతుకముగా పరిపూర్తిని, సహేతుక పరిణతిని చూర్చుటకు జన్మించెనని మరల నేను నొక్కి వక్కాణించుచున్నాను.

హిందువుల ధర్మము కర్మకాండ, జ్ఞానకాండము లనే రెండు భాగాలుగా విభజింపబడియున్నది. జ్ఞానకాండను ముఖ్యముగా సన్యాసులు అనుసరిస్తారు.

జ్ఞానకాండ విషయంలో జాతిభేద మనేది-వర్ణభేద మనేది లేదు. అగ్రవర్ణానికి చెందినవాడును, తక్కువ వర్ణానికి చెందినవాడును కూడ సన్యాసి కావచ్చును. అప్పుడా రెండు వర్ణాలు సమానము లవుతాయి. మత విషయంలో వర్ణవ్యవస్థ అనేది లేనేలేదు. వర్ణవ్యవస్థ కేవలము ఒక సాంఘిక కట్టుబాటే! శాక్యముని స్వయంగా సన్న్యాసి: నిగూఢమైన వేద తత్త్వాన్ని బయటకు తీసి, సమస్త ప్రపంచానికి వ్యాప్తిచేసిన మహనీయుడాతడు. ధర్మ ప్రచారమును ఆచరణలోనికి తీసుకురావటానికి-ఏల, మత పరివర్తనము (అనగా ఇతర మతస్థులచే తన మత మవలంబింపచేసి వారిని స్వమతంలో చేర్చుకోవడం) అనే ఆశయాన్ని ఊహించడానికి ఆతడే ప్రథముడు.

అందరియందూ, ముఖ్యముగా అజ్ఞానులయందు, పేదలయందు ఆ గురువరేణ్యుడు చూపెట్టిన అద్భుత సానుభూతిలో అతని మహత్త్వమంతా ఇమిడి ఉంది. ఆతని శిష్యులలో కొందరు స్వయంగా బ్రాహ్మణులు. బుద్ధుడు ధర్మప్రచారం చేసే సమయంలో సంస్కృతము వ్యావహారిక

భాష కాదు. బుద్ధుని బ్రాహ్మణ శిష్యులు కొందరు అతని బోధనలను సంస్కృతములోకి అనువదించడానికి పూనుకుంటే, వారికి అతడిలా స్పష్టంగా చెప్పాడు: "పేదలకు, జనసామాన్యులకు తోడ్పడడమే నా ఆశయం: ప్రజల మాతృ భాషలోనే నన్ను మాట్లాడనివ్వండి." కావున ఇప్పటివరకు అతని బోధనలలో ఎక్కువ భాగము అప్పటి వాడుక భాష లోనే ఉంది.

తత్త్వశాస్త్రం ఏది చెప్పినా, వేదాంతమేది స్థిరపరచినా, చావన్నది ఉన్నంతవరకు, మానవహృదయంలో దౌర్బల్య మున్నంతవరకు, బల హీనావస్థ యందున్న మానవహృదయం నుండి (రక్షణార్థము) ఆర్త నాదము వెలువడుచున్నంతవరకు—భగవంతుని యందు నమ్మకం అనేది ఉండి తీరుతుంది.

తాత్త్విక విషయంలో బుద్ధదేవుని శిష్యులు వేదాలనే సుస్థిర పర్వతాలను ఢీకొని, వాటిని కదలింపలేకపోవడంతో—స్త్రీ పురుషుడు, ప్రతి వ్యక్తి ఎంతో ఆశతో ఆశ్రయించుకొని ఉన్న భగవంతు డనే శాశ్వతమైన సాంప్రదాయాన్ని సమాజమునుండి లాగివేశారు. ఫలితమేమిటి? బౌద్ధ మతము హిందూదేశంలో స్వాభావిక వినాశము పొందవలసి వచ్చింది. బౌద్ధమత జన్మస్థానమైన భారతదేశంలో ఇప్పుడు బౌద్ధు డనిపించుకొను వాడు ఒక్కడును లేడు.

కాని బ్రాహ్మణ మతానికి కొంత నష్టము కలిగింది. ఆ సంస్కరణ దీక్ష, ప్రతిజీవిపై వుండే ఆ అద్భుత దాన దయా భావాలు, గ్రీసు దేశీయ చరిత్రకారునిచే హిందువు అసత్యములు చెప్పడంకాని, హైందవ స్త్రీ వ్యభిచారిణియై ఉండడం కాని కని విని ఎరుగననిపించుకొను నంతటి ఘనత హైందవ సమాజానికి చేకూర్చి, జనులలలో బౌద్ధమతము వెల్గొందించిన ఆ అద్భుత పవిత్రతా ప్రభావము—ఇవన్నీ బ్రాహ్మణ మతము కోల్పోయింది.

హిందూమతము లేనిదే బౌద్ధమతము — బౌద్ధమతము లేనిదే హిందూమతము చైతన్యవంతములై ఉండలేవు. కావున బ్రాహ్మణుల బుద్ధి కుశలత, వేదాంత విజ్ఞానములు లేనిదే బౌద్ధులు నిలువలేరని, బౌద్ధుల ఔదార్యము, సర్వభూత ప్రేమలు లేనిదే బ్రాహ్మణులు నిలువలేరని ఈ పరస్పర వియోగం మనకి ఎలా చాటుతూవుందో గమనించు. బ్రాహ్మణులకును, బౌద్ధులకును ఒకరొకరితో కలిగిన ఈ ఎడబాటే హిందూదేశ పతనానికి కారణము. హిందూదేశము ముప్పదికోట్ల బిచ్చగాళ్ళతో నిండియుండుటకు, వేయి సంవత్సరాలుగా విదేశీ విజేతలకు దాస్యము చేయుచుండుటకు ఇదియే కారణము. కావున ఆ గురువరేణ్యుని (బుద్ధుని) ఔదార్యముతో, అద్భుతమగు లోకహితాచరణమును ప్రేరేపించే శక్తి సామర్థ్యములతో బ్రాహ్మణుని అఖండ బుద్ధికుశలతని మేళవింతుము గాక! (బుద్ధుని భూతదయను—శంకరుని అఖండ మేధాశక్తిని మేళవింతుముగాక!)

—•—